**Tahreek-e-Islami**
**kamiyaabi ke Sharaayat (Telugu)**

# ఇస్లామీయ ఉద్యమం విజయానికి సోపానాలు

రచయిత :

సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది (రహ్మాలై)

అనువాదం :

అలిఫ్షైన్

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# పరిచయ పలుకులు

ప్రజలను బాధ్యతాయుతులైన వ్యక్తులుగా తీర్చిదిద్దడం, సత్సమాజ నిర్మాణం కొరకు సమాయత్తమయ్యే భావిపౌరులుగా వారిని రూపొందించడం ఈ సంస్థ ప్రధాన లక్ష్యం. ఈ లక్ష్యం దృష్ట్యా అది సమాజంలోని పౌరుల్లో క్రియాశీలతను ఉత్తేజపరచడానికి తగిన సాహిత్యాన్ని కూడా సమకూర్చుకున్నది. ఈ సాహిత్యం ఎక్కువగా ఉర్దూ భాషలో ఉంది. తెలుగు భాషలో ఇలాంటి సాహిత్యం కోసం ఈ సంస్థ ఎంతో చేస్తోంది.

విశ్వవిఖ్యాత తత్వవేత్త ఇస్లామీయ ఉద్యమ వ్యవస్థాపకులు మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది (రహ్మాలై) గారు ఉద్యమ కార్యకర్తలకు ఇచ్చిన హితవులు, చేసిన సూచనలు 'తహ్‌రీకె ఇస్లామీ - కామియాబీ కే షరాయత్' అన్న పుస్తకం రూపంలో వెలువడ్డాయి. ఈ పుస్తకం ఉర్దూ యువతలో ఓ నూతనోత్తేజాన్ని, ఓ కొంగ్రొత్త కార్యదీక్షను జనింపజేసింది. దాని అనువాదమే మీ ముందున్న ఈ చిరు పుస్తకం.

మూల భాషలోని రచయిత మౌలిక భావాలకు ఏ మాత్రం విఘాతం కలగకుండా వీలైనంత సరళంగా, సులభగ్రాహ్యంగా అనువదించటానికి కృషి జరిగింది. ఈ పుస్తకం కేవలం ఇస్లామీయ ఉద్యమ కార్యకర్తల్ని మాత్రమే దృష్టిలో పెట్టుకొని రాసినప్పటికీ ఇస్లాం ధ్యేయాన్ని తమ జీవిత లక్ష్యంగా నిర్ణయించుకున్న ప్రతి ముస్లింకూ ఇది ఉపకరిస్తుందనడంలో ఎలాంటి సందేహం లేదు. కనుక ముస్లిం సోదరులందరూ దీన్ని ఆదరించి అధ్యయనం చేస్తారని ఆశిస్తున్నాము.

- ప్రకాశకులు

# విషయ సూచిక

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# 1. ఉపోద్ఘాతం

దేశంలో ఒక ఆదర్శవంతమైన సమాజం ఉనికిలోకి రావాలని మనసారా కోరుకునేవారు ముందుగా ఒక విషయాన్ని అర్థం చేసుకోవాలి. సత్సమాజ నిర్మాణాన్ని కోరుకునే సమాజ శ్రేయోభిలాషులకు మన దేశంలో ఎలాంటి కొదువా లేదు. కాని ఆ కోరికను ఆచరణలో పెట్టడానికి మనస్ఫూర్తిగా ముందుకు వచ్చేవాళ్ళు కరువయ్యారు. అంతేకాదు, ఈ కోరికను సాధించటానికి కావలసిన దీక్షాదక్షతలు కొరవడ్డాయి. ముఖ్యంగా ఈ పని కోసం కావలసిన మౌలిక లక్షణాలు చాలా మందిలో లోపించాయి.

మనం దృష్టిలో పెట్టుకోవలసిన రెండవ విషయం సమాజంలో పేరు పలుకుబడులు గల వారంతా ఎక్కువగా సమాజ విచ్ఛిన్నం కోసమే పని చేస్తున్నారు. పోనీ విచ్ఛిన్నకరమైన పనులకు దూరంగా ఉన్నవారయినా సమాజ నిర్మాణం పట్ల శ్రద్ధ చూపుతున్నారా అంటే అదీ లేదు. సమాజ సంస్కరణ, దేశపునర్నిణాల కోసం కృషి చేస్తున్నవారు నేడు నూటికో కోటికో ఒకరిద్దరు మాత్రమే కనిపిస్తారు.

పోతే, మనం గుర్తుంచుకోవలసిన మూడో విషయం సాముహిక జీవితం. నేటి కాలంలో సాముహిక జీవితాన్ని బాగు చేయాలన్నా, చెడగొట్టాలన్నా అన్నిటికంటే శక్తిమంతమైన సాధనం ప్రభుత్వమే. సమాజ నిర్మాణం, సమాజ విచ్ఛిన్నతలు పాలకుల చేతుల్లోనే ఉంటాయి. ప్రజాస్వామిక వ్యవస్థ అమల్లో ఉన్న చోట ప్రభుత్వం పనితీరు సరిగా ఉందా లేదా అనేది, ప్రజలు అధికారాన్ని మంచివారికి హస్తగతం చేశారా లేక చెడ్డవారికి కట్టబెట్టారా అనే విషయం మీదనే ఆధారపడి ఉంటుంది. సమాజ విచ్ఛిన్నం కోసం పని చేసేవారు తమ శక్తియుక్తులన్నిటినీ ప్రజలను తప్పుదారి పట్టించడానికే వినియోగిస్తున్నారు. ఈ విధంగా వారు ప్రజలను ఎన్నికల్లో మంచి వ్యక్తులను ఎన్నటికీ ఎన్నుకోలేని అయోగ్యులుగా తయారు చేస్తున్నారు.

ఈ మూడు యదార్థాలు కలసి ఓ భయానక దృశ్యాన్ని మన

ముందుంచుతున్నాయి. దీన్ని ఒకసారి చూస్తే చాలు, మనిషి హృదయం కకావికలమయి పోతుంది. అతను నిరాశా నిస్పృహలకు లోనయి, ఇక్కడ ఏదైనా మంచి పని కోసం కృషి చేస్తే నెరవేరుతుందా లేదా అని సందిగ్ధంలో పడిపోతాడు. అయితే ఈ మూడు యదార్థాలకు భిన్నంగా మరికొన్ని యదార్థాలు కూడా మన సమాజంలో ఉన్నాయి. వాటిపై దృష్టిసారిస్తే నిరాశా నిస్పృహలు వాటంతటవే పటాపంచలయి ఆశాకిరణాలు గోచరిస్తాయి.

వీటిలో మొట్టమొదటి యదార్థం మన సమాజం పూర్తిగా దుర్జనులతోనే నిండిపోలేదు. ఇందులో కొందరు సజ్జనులు కూడా మనకు అక్కడక్కడా కనిపిస్తారు. వారిలో కేవలం సమాజ సంస్కరణాభిలాష మాత్రమే గాక, దానికోసం పూనుకోవాలన్న ఉత్సాహం, శక్తి సామర్థ్యాలు కూడా ఉన్నాయి. వారిలో ఏదైనా లోపం ఉంటే, కాస్త శ్రద్ధవహించి కృషిచేస్తే చాలు దాన్ని సులభంగా దూరం చేయవచ్చు.

రెండవ విషయం – సాధారణంగా మన దేశ ప్రజలు చెడును అభిలషించేవారు కాదు. అజ్ఞానం, అమాయకత్వం కారణంగా మోసానికి గురికావచ్చు, గురవుతున్నారు కూడా. కాని మోసగాళ్ళు చేస్తున్న సమాజ విచ్ఛిన్న చర్యలకు వారు తమ ఆమోదముద్ర వేయడం లేదు. కనుక యుక్తి, వివేకాలతో సంఘటితంగా కృషిచేస్తే సంస్కరణాభిలాషగల వ్యక్తులకు అనుకూలంగా ప్రజాభిప్రాయాన్ని మలచడం పెద్ద కష్టమేమీ కాదు.

మూడో విషయం – విచ్ఛిన్నం కోసం పనిచేసేవారికి అన్ని ఒనరులు ఉన్నాయి కాని రెండు విషయాలు మాత్రం లోపించాయి. ఒకటి – నీతి నడవడికల శక్తి, రెండు – ఐకమత్యం.

ఇక నాల్గవ విషయం – అన్నిటికంటే అతి ముఖ్యమైన విషయం ధర్మ సంస్థాపనం దైవకార్యం కనుక, దానికోసం కృషి చేసే వారికి దైవసహాయం తప్పనిసరిగా లభిస్తుంది. కాకపోతే ఈ మార్గంలో చిత్తశుద్ధి, సహనం, సంయమనాలతో పనిచేయవలసి ఉంటుంది. నేర్పు చాకచక్యాలను ఏమాత్రం విస్మరించకూడదు. వారి వద్ద కార్యకర్తలు ఎంత అల్ప సంఖ్యలో ఉన్నా, వారి ఒనరులు పరిమితంగా ఉన్నాసరే దైవ సహాయం ఆ లోటు పూరిస్తుంది.

నిరాశ అనే కారుమబ్బుల చాటున తొంగిచూసే ఆశాకిరణాలు మనిషికి ఎంతో ధైర్యాన్ని చేకూర్చుతాయి. ఆదర్శ సమాజం ఉనికిలోకి రావడం సాధ్యం కావడమే కాదు, అది విజయవంత మవుతుందన్న ఆత్మ విశ్వాసం కూడా అతనిలో జనిస్తుంది. అయితే ఆదర్శ సమాజాన్ని మనస్ఫూర్తిగా కోరుకునే వ్యక్తులు తమ ఆశలు అభిలాషలకు అనుగుణంగా కార్యరంగంలోకి దూకడానికి సిద్ధం కావాలి. దైవ సంప్రదాయం ప్రకారం కార్యసఫలతకై నిర్దేశించబడిన సహజ పద్ధతుల్నే అనుసరిస్తూ ధ్యేయ పథంలో పురోగమించాలి.

దైవ సంప్రదాయమంటే కేవలం చెడులపై విమర్శనాస్త్రాలు సంధిస్తూ కూర్చోవడం కాదు. కేవలం నోటిమాటలతో ఇవి దూరం కాజాలవు. మనం కూర్చున్న చోటు నుండి ఒక్క అంగుళమైనా కదలకపోతే, వళ్ళువంచి కాస్తయినా పనిచేయకపోతే దారిలోని ఒక ముల్లు కూడా తన స్థానం నుండి తొలగిపోదు. అలాంటప్పుడు కేవలం వాక్చాణాలు వదలుతున్నంత మాత్రాన సమాజంలో దశాబ్దాల తరబడి పేరుకుపోయిన చెడుగులు ఎలా దూరమవుతాయి? రైతు కష్టపడకుండా ఒక్క గోధుమ గింజయినా పండించలేడు. మరి కేవలం కోరికలు వేడుకోళ్ళతో సమాజంలో సదాచారాల పొలం సస్యశ్యామలమవుతుందని ఎలా ఆశించగలం?

విమర్శల వల్ల ఉపయోగం ఉంటుందన్నది నిజమే. అయితే కార్యాచరణ రంగంలో మనం చేయవలసినదంతా చేసి దాని పరిపూర్తికై దైవాన్ని వేడుకున్నప్పుడే ఈ విమర్శలు, ఉపదేశాలు ఉపయోగపడతాయి. ఈ పనిలో మనకు సహాయపడేందుకు దైవదూతలు దిగి వస్తారనడంలో కూడా సందేహం లేదు. కాని వారు స్వయంగా దుష్టశక్తులతో పోరాడటానికి రారు. దైవమార్గంలో ప్రాణాలకు తెగించిపోరాడే సత్యపథగాములకు సహాయపడేందుకు మాత్రమే వస్తారు.

కనుక క్రియారంగంలో ప్రవేశించటానికి ఇష్టపడేవారు భ్రమలను, పేరాశలను వదలి ప్రశాంత హృదయంతో ధర్మసంస్థాపనకై తీసుకోవలసిన చర్యలను గురించి ముందుగా అర్థం చేసుకోవాలి. పూర్తిగా ఒక అవగాహనకు వచ్చిన తరువాత, ఈ పని చేయాలా? లేక చెడుగులపై విమర్శనాస్త్రాలు సంధిస్తూ సమాజపు నిర్మాణం గురించిన ఆకాంక్షలను కేవలం మనసులోనే పెట్టుకొని తృప్తి చెందాలా అన్నది

నిర్ణయించుకోవాలి. క్రియారంగంలో దిగాలని నిర్ణయించుకునేవారు క్షణికావేశాలకు లోనవకుండా అన్ని విధాలా ప్రశాంత హృదయంతో ఆలోచించిన మీదటే నిర్ణయానికి రావాలి.

క్షణికోద్రేకంలో శక్తి ఉన్న మాట నిజమే. మనిషి అమితోత్సాహంతో రంగంలోకి దూకుతాడు. అయితే ఆ మరుక్షణమే తుపాకి గుండుకు బలయి ప్రాణాలు కోల్పోతాడు. అంతకు మించి ఈ క్షణికోద్రేకంలో ఎలాంటి శక్తి లేదు. ఇది మనిషిని నాలుగు రోజులైనా చెడుకు దూరంగా ఉండేలా గాని, మంచిని అంటిపెట్టుకుని ఉండేలా గాని చేయజాలదు. క్షణికోద్రేకానికి లోనయ్యే వ్యక్తి నిర్ణీత లక్ష్యం కోసం జీవితాంతం అవిశ్రాంతంగా పోరాడలేడు. తమ జీవితమంతా లక్ష్యసాధనలోనే ధారపోయవలసి ఉందని నిర్ణయించుకున్న వ్యక్తులు మాత్రమే సమాజ నిర్మాణపు పని చేయగలుగుతారు.

క్రియా రంగంలో దిగడానికి అంగీకరించిన తరువాత ప్రజలు సాధారణంగా కార్యక్రమాన్ని గురించి ప్రశ్నిస్తారు. "సరే, మేము పని చేయడానికి నిర్ణయించుకున్నాం. ఇక ఆ పని కోసం చేపట్టవలసిన కార్యక్రమం ఏమిటో చెప్పండి" అని అడుగుతారు. కాని వారు ఓ విషయం మరచి పోతుంటారు. పని చేయడానికి నిర్ణయించడం, కార్యక్రమానికి ఆచరణరూపు ఇవ్వడం, వీటన్నింటిలోనూ స్వయాన కార్యకర్త వ్యక్తిత్వం కీలకపాత్ర పోషిస్తుంది. ఈ విషయాన్ని విస్మరించి పని గురించి, కార్యక్రమాలను గురించి మాట్లాడటం సమంజసం కాదు. ఆచరణ కోసం దృఢ సంకల్పం చాలు, ఆ తరువాత కావలసింది దానికి సంబంధించిన కార్యక్రమమే అని భావించడం సరికాదు. ఈ తప్పుడు భావన మూలంగానే చాలామంది పెద్ద పెద్ద ప్రాజెక్టులు చేపడ్తారు కాని, అవి నిర్ణీత లక్ష్యాలకు చేరకముందే ఘోరంగా విఫలమయి పోతున్నారు.

లక్ష్య సాధనకు కావలసిన అసలు విషయాలు ప్రోగ్రామ్‌లు, పథకాలు కావు. పనిని నేర్పుగా నిర్వహించే వ్యక్తులు, వారి గుణగణాలు మాత్రమే ముఖ్యమైనవి. ఒక్కొక్క వ్యక్తిలోని వ్యక్తిగత గుణగణాలతో పాటు, ఆ వ్యక్తుల సామూహిక సుగుణాలు ఈ పనికి ఎంతో అవసరం. వారిలోని ప్రతి బలహీనత ఫలితాన్ని ప్రభావితం చేస్తుంది. ప్రతి మంచి లక్షణం ప్రయోజనాన్ని చేకూర్చుతుంది. వారు నీతి నడవడికలు గల వ్యక్తులయి ఉంటే లోపాలతో కూడిన కార్యాచరణ విధానాన్ని అవలంబించినప్పటికీ

ఒక్కోసారి ప్రపంచం దిగ్భ్రాంతి చెందేలా పనిని విజయవంతంగా నిర్వహించి చూపెట్టారు. దీనికి భిన్నంగా వారు అసమర్థులు, అవినీతిపరులయి ఉంటే చేపట్టిన ఎన్నో మంచి పనులు కూడా చెడిపోతాయి. పైగా అసమర్థుల చేతికి చిక్కిన ఇంతటి మంచి పని సయితం లోకం దృష్టిలో అనుమానాస్పదంగా మిగిలిపోతుంది.

కాబట్టి మనం నిర్మాణం, సంస్కరణ పనుల్ని చేపట్టే ముందు, కార్యక్రమం, కార్యాచరణల గురించిన ప్రతిపాదనల్ని పరిశీలించడానికి ముందు ఈ పనికోసం ముందుకు వచ్చిన వారి గుణగణాలు ఎలాంటివి, వారిలో ఎలాంటి లక్షణాలున్నాయి. ఏ ఏ లోపాలు లేకుండా ఉండాలి, ఇలాంటి వ్యక్తులు తయారు కావడానికి దోహదపడే ఒనరులేమిటి తదితర విషయాల్ని గురించి సరిగ్గా అంచనా వేసుకోవాలి.

రాబోయే పంక్తుల్లో ఈ విషయాన్ని దిగువ వరుస క్రమం ప్రకారం తెలుసుకుందాం :

1. ఈ లక్ష్యం కోసం పనిచేసే ప్రతి వ్యక్తిలోనూ ఉండవలసిన వ్యక్తిగత లక్షణాలు.
2. ఒక సంస్థ (జమాఅత్) గా వారిలో ఉండవలసిన సామూహిక లక్షణాలు.
3. సందేశవ్యాప్తి, ధర్మ సంస్థాపనలకై జరిగే కృషి విజయవంతం కావడానికి కావలసిన కార్య నిర్వాహక లక్షణాలు - అంటే ప్రత్యేక లక్షణాలు.
4. సంస్థలోని ప్రతి వ్యక్తీ వ్యక్తిగతంగా, సంస్థాపరంగా విడనాడవలసిన పెద్ద చెడుగులు.
5. కావలసిన మంచి లక్షణాల పురోభివృద్ధికి, అవాంఛనీయ లక్షణాల ప్రక్షాళనకు వ్యక్తులకు, సంస్థకు తోడ్పడగల యుక్తులు - విధానాలు.

ప్రపంచంలో ఇస్లామీయ జీవన వ్యవస్థను ఆచరణాత్మకంగా స్థాపించడానికి దైవసహాయం తరువాత కావలసిన అతి ముఖ్య విషయం ఆ మార్గంలో కృషి చేసేవారిలో ఉండవలసిన లక్షణాలే. లక్ష్యసాధనలో ప్రధాన పాత్ర వహించేది ఈ విషయమే. వీటి మీదే వారి జయాపజయాలు ఆధారపడి ఉంటాయి. సంస్థ (జమాఅత్)లోని ప్రతి ఒక్కరిలోనూ వ్యక్తిగతంగా ఉండవలసిన లక్షణాలు కొన్ని ఉంటే, వారిలో

సాముదాయికంగా ఉండవలసిన లక్షణాలు మరికొన్ని ఉన్నాయి. అలాగే నిర్మాణం, సంస్కరణలకు సంబంధించిన సేవ చేయడానికి అవసరమయ్యే ప్రత్యేక లక్షణాలు ఇంకొన్ని ఉన్నాయి.

వీటితోపాటు సంస్థ, సంస్థ కార్యకర్తలు దూరంగా ఉండవలసిన చెడులు కూడా ఉన్నాయి. ఈ చెడుల్ని విడనాడకపోతే, జరిగిన పనంతా బూడిదలో పోసిన పన్నీరులా వృథా అయ్యే ప్రమాదం ఉంది. అందువల్ల ధర్మ సంస్థాపన పట్ల నిజమైన శ్రద్ధాసక్తులు ఉన్నవారు అవసరమైన మంచి లక్షణాలను తమలో పెంపొందించుకోవడానికి, అవాంఛనీయ లక్షణాలకు దూరంగా ఉండేందుకు ముందుగా ఈ విషయాలను అర్థం చేసుకోవాల్సి ఉంటుంది. సమాజ నిర్మాణం కోసం జరిగే కృషిలో వ్యక్తి నిర్మాణం మొట్టమొదటి షరతు. తనను తాను సంస్కరించుకోలేని వ్యక్తి ఇతరుల్ని సంస్కరించలేడు. కనుక వ్యక్తి నిర్మాణంపైన సమాజ నిర్మాణం ఆధారపడి ఉంటుందన్న విషయాన్ని మనం సదా గుర్తుంచుకోవాలి.



# 2. వ్యక్తిగత లక్షణాలు

## 1. ఇస్లాం గురించి సరయిన అవగాహన

వ్యక్తిగత లక్షణాలలో మొట్టమొదట పేర్కొనదగినది ఇస్లాం పట్ల సరయిన అవగాహన. ఇస్లామీయ జీవన వ్యవస్థను స్థాపించాలని కోరుకునే వ్యక్తి ముందుగా తాను నెలకొల్పబోయే వ్యవస్థను గురించి సరిగా, సమగ్రంగా, క్షుణ్ణంగా అర్థం చేసుకోవలసి ఉంటుంది. దీనికోసం ఇస్లాంకు సంబంధించిన పై పై జ్ఞానం సరిపోదు. శక్తి సామర్థ్యాల మేరకు లోతుగా అధ్యయం చేసి విపులమైన జ్ఞానాన్ని ఆర్జించాలి.

అయితే ఈ మార్గంలోని ప్రతి వ్యక్తీ, ఈ ఉద్యమంలోని ప్రతి కార్యకర్త మౌల్వీ, ముఫ్తీ లేక ముజ్తహిద్ కానవసరం లేదు. కాకపోతే వారిలో ప్రతి వ్యక్తీ ఇస్లామీయ విశ్వాసాలకు, మూఢ నమ్మకాలకు, అజ్ఞాన అనాగరిక భావాలకు మధ్య ఉండే తారతమ్యాలను సరిగా తెలుసుకుని ఉండాలి. అదీగాక విభిన్న జీవన రంగాల్లో ఇస్లాం మానవులకు ఎలా దారి చూపుతుందో కూడా గ్రహించి ఉండాలి. ఈ కనీస అవగాహన, విషయ పరిజ్ఞానం లేకుండా మనిషి రుజుమార్గాన పయనించలేడు. ఇతరులకూ రుజుమార్గం చూపలేడు. అంతేగాక అతను సమాజ నిర్మాణం కోసం సరయిన పంథాలో ఏ పనీ చేయలేడు.

అందువల్ల సాధారణ కార్యకర్తలకు దైవధర్మం గురించి, ప్రజానీకానికి సరళంగా వివరించగలిగేటంత జ్ఞానమయినా ఉండాలి. మేధా సంపన్నులకు నచ్చజెప్పడానికయితే కార్యకర్తలు లోతుగా అధ్యయనం చేసి మరింత జ్ఞానాన్ని సముపార్జించవలసి ఉంటుంది. అలాంటివారే మేధావి వర్గాలను ప్రభావితం చేయగలరు. విద్యావంతుల సందేహాలను, సంశయాలను నివృత్తి చేయగలరు. ఉద్యమ వ్యతిరేకుల ఆరోపణలకు సహేతుకమైన, సంతృప్తికరమైన సమాధానం ఇవ్వగలరు.

అంతేకాదు, వారు వివిధ జీవన రంగాలకు సంబంధించిన సమస్యలకు ఇస్లాం వెలుగులో సరయిన పరిష్కారమార్గాలు సూచించగలరు, కళా రీతులకు, విద్యాపరమైన అంశాలకు ఇస్లామీయ దృక్పథం ప్రకారం సరికొత్తగా క్రోడీకరణ చేయగలరు; ఓ

కొత్త సంస్కృతీ సౌధాన్ని, ఓ నవీన నాగరిక భవనాన్ని ఇస్లామ్ పునాదులపై నిర్మించగలరు. ఆధునిక కాలపు ఆలోచనా రీతులు, ఆచరణ విధానాల్లో ఉండే మంచీ చెడుల్ని వేరుచేయగలిగేటంత విచక్షణా జ్ఞానం, విమర్శనా సామర్థ్యం కూడా వారిలో ఉండాలి. దాంతోపాటు నిర్మూలించవలసిన దాన్ని నిర్మూలించి ఆ స్థానంలో ఓ మంచి పనిని స్థాపించగలిగే, ఉంచదగిన దాన్ని యధాతథంగా ఉంచి దాన్ని ఓ మెరుగైన వ్యవస్థలో వినియోగించగలిగే సృజనాత్మక శక్తి కూడా ఉద్యమకారుల్లో ఉ ండటం ఎంతో అవసరం.

## 2. ఇస్లాం పట్ల దృఢ విశ్వాసం

జ్ఞానం, అవగాహనల తరువాత ఈ లక్ష్యం కోసం పనిచేసే వారికి తప్పనిసరిగా ఉండవలసిన రెండవ లక్షణం ఇస్లాం పట్ల దృఢ విశ్వాసం. ఏ వ్యవస్థ పునాదులపై మానవ జీవిత సౌధాన్ని నిర్మించదలిచారో ఆ వ్యవస్థ పట్ల వారికి అచంచల విశ్వాసం ఉండాలి. అది సరయినది, సత్యమయినదన్న సంతృప్తి ఉండాలి. వారి హృదయాలు ఆ వ్యవస్థ విషయంలో పూర్తిగా నిబద్ధమై ఉండాలి. సందేహాలకు, సంశయాలకు ఎలాంటి తావుండకూడదు. చపల చిత్తులు, చంచల స్వభావులు, పరస్పర విరుద్ధ భావాలు గలవారు ఈ పని చేయలేరు. ఏకాగ్రత లోపించిన వారు, డోలాయమాన హృదయులు, బాహ్యశక్తుల ప్రభావానికి లోనయ్యేవారు ఈ పనికి ఎన్నటికీ తగరు.

ఈ పని చేయదలచుకున్న వారెవరైనా సరే దైవంపై, దైవధర్మంపై, పరలోకంపై తిరుగులేని విశ్వాసం కలిగి ఉండాలి. దేవుడు ఉన్నాడని, ఆయన దివ్య ఖుర్ఆన్‌లో పేర్కొనబడిన విధంగానే గుణగణాలు, హక్కులు, అధికారాలు కలిగి ఉన్నాడని, గట్టిగా నమ్మాలి. మరణానంతరం మరో జీవితం ఉందని, అది ఖుర్ఆన్‌లో వర్ణించబడిన విధంగానే ఉందని పూర్తి నమ్మకం ఉండాలి. రుజుమార్గం ఒక్కటేనని, అది అంతిమ దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) చూపిన మార్గమేనని, దానికి వ్యతిరేకమయినవి లేక దాని దృక్పథానికి అనుగుణంగా లేనివి అన్నీ అపమార్గాలని దృఢంగా విశ్వసించాలి.

దీనికి భిన్నంగా ఇతరులు మరే సిద్ధాంతం లేక ఆలోచనా విధానాన్ని తెచ్చిపెట్టినా వాటిని దాని మంచీచెడులు వేరుపరచి చూసే గీటురాయి ఒక్కటే. అదే "దైవగ్రంథం, దైవప్రవక్త సంప్రదాయం". ఈ గీటురాయిపై మేలిమి అని నిర్ధారితమయ్యేదే మేలిమి.

కల్తీ అని తేలేది కల్తీ. ఇస్లామీయ జీవన వ్యవస్థను నెలకొల్పడానికి ఈ వాస్తవాల పట్ల పటిష్టమైన విశ్వాసం ఉండాలి, వాటిపై పూర్తి సంతృప్తి, శ్రద్ధాసక్తులు ఉండాలి. పని విషయంలో అణుమాత్రం సందిగ్ధం ఉన్నా లేదా, లేశమైనా ఇతర విధానాలు వ్యవస్థల పట్ల ఆసక్తి అభిరుచులు ఉన్నా వాటిని తక్షణమే విసర్జించాలి. ఇస్లామీయ జీవన వ్యవస్థకు నిర్మాతలుగా పనిచేయడానికి ఇలాంటి బలహీనతలన్నింటినీ తొలగించుకోవాలి.

## 3. శీల నిర్మాణం

మూడవ అనివార్య లక్షణం మనిషి వాక్క్రియల మధ్య పొంతన ఉండాలి. తాను సత్యం, ధర్మం అని నమ్మిన దాన్ని ఆచరణలో పెట్టాలి. అసత్యం, అధర్మం అని భావించిన దాన్ని విడనాడాలి. బయటి నుంచి వచ్చే వత్తిడికి లొంగిపోకూడదు. తాను విశ్వసిస్తున్న జీవన వ్యవస్థకు అనుగుణంగా తన నీతి నడవడికలను మలచుకోవాలి. ఏ విషయాన్నయితే ప్రచారం చేస్తూ ప్రజల్ని దాని వైపునకు పిలుస్తాడో, అందరికంటే ముందు తాను స్వయంగా దాన్ని అవలంబించాలి.

ఒక పనిని అత్యంత శ్రద్ధాసక్తులతో మనస్ఫూర్తిగా నిర్వర్తించేటప్పుడు అది దైవ సంతోషానికి కారణభూత మవుతుందన్న విషయమొక్కటే అతని దృష్టిలో ఉండాలి. అలాగే ఫలానా పని దైవానికి ఇష్టం లేదు. కనుకనే దానికి దూరంగా మసలుకోవాలన్న భావన అతనిలో ఉండాలి.

ఈ వైఖరి సాధారణ పరిస్థితుల్లో మాత్రమే కాదు, చెడులు అసాధారణంగా ప్రబలి ఉన్న వాతావరణంలోనూ ఎలాంటి బెరుకు లేకుండా, ప్రలోభాలకు లొంగకుండా అడ్డంకులను అధిగమిస్తూ సత్య ధర్మంపై దృఢంగా నిలబడి ఉండాలి. సమాజంలోని చెడుగుల్ని నిరోధించే ప్రయత్నాలు సఫలం కాలేకపోయినా ఆశ, ఆత్మస్థయిర్యాలను వీడకుండా సన్మార్గంపై స్థిరంగా ఉండగలిగే నైతిక శక్తి ఉండాలి.

ఈ లక్షణం లేనివారు సమాజ సంస్కరణోద్యమానికి సహకారులుగా, సానుభూతిపరులుగా మాత్రమే తయారు కాగలరు గాని, క్రియాశీల కార్యకర్తలుగా రాణించలేరు. ఇస్లాంను అభిమానించే ప్రతి వ్యక్తీ ఈ పనిలో సహాయపడగలడు.

చివరికి ఇస్లాం వ్యతిరేకులు కానివారు సయితం ఈ ఉద్యమానికి ఎంతో కొంత తోడ్పడగలరు. అయితే ఇలాంటి సహాయకులు, సానుభూతిపరులు కోట్ల సంఖ్యలో ఉన్నా ఆచరణాత్మకంగా ఇస్లామీయ వ్యవస్థ నెలకొనదు.

ఈ కార్యనిర్వహణ కోసం జ్ఞానసంపత్తి, విశ్వాస భాగ్యాలతో పాటు, నైతిక శక్తి కూడా ఉండాలి. బాహ్య శక్తులకు తలవొగ్గక కేవలం అంతర్ ప్రేరణతో ధార్మిక విధుల్ని నిర్వర్తించ గలిగేటంతటి సజీవ విశ్వాసం, చైతన్యవంతమైన హృదయం కలిగి ఉండాలి. ఇలాంటి చురుకైన కార్యకర్తలు గనక రంగంలో ప్రవేశిస్తే, ముస్లిం సమాజంలోనే గాక, ముస్లిమేతర సమాజంలోనూ ఉండే ఎందరో సహాయకులు, సానుభూతిపరుల వల్ల కూడా ఉద్యమానికి ప్రయోజనం చేకూరుతుంది.

## 4. జీవన ధ్యేయంగా దైవధర్మం

ఉద్యమ కార్యకర్తలు ఈ మూడు లక్షణాలతో పాటు మరో లక్షణం కూడా కలిగి ఉండాలి. అది - ఇస్లాంను తమ జీవిత లక్ష్యంగా అవలంబించాలి. ధర్మ సంస్థాపన, దైవవచన ఉన్నతి పట్ల కేవలం ఆసక్తి, అభిలాషలు మాత్రమే కలిగి ఉంటే సరిపోదు, అవి కార్యకర్తకు పరమోన్నత జీవన ధ్యేయమయిపోవాలి. కొందరికి ఇస్లాం అంటే ఏమిటో తెలుసు. దాన్ని విశ్వసిస్తారు. దాని ప్రకారం ఆచరిస్తారు కూడా. కాని దాన్ని నెలకొల్పడానికి కృషి చేసే, ఉద్యమించే పనిని వారు తమ దినచర్యగా చేసుకోరు. వారు ఒకవైపు ధార్మిక విధుల్ని ఆచరిస్తూనే మరోవైపు ప్రపంచ వ్యవహారాల్లో నీతి నిజాయితీలను అవలంబిస్తూ నిమగ్నులై ఉంటారు.

వీరు సజ్జనులు, సచ్ఛీలురు అనడంలో ఎలాంటి సందేహం లేదు. ఇస్లామీయ జీవన వ్యవస్థ క్రియాత్మకంగా నెలకొంటే, ఆ వ్యవస్థలో వీరు మంచి పౌరులుగా మనుగడ సాగించగలరు. అయితే అజ్ఞాన జీవన వ్యవస్థ పూర్తిగా వ్రేళ్ళూని ఉన్నప్పుడు దాన్ని నిర్మూలించి ఆ స్థానంలో ఇస్లామీయ సౌధాన్ని స్థాపించవలసిన అవసరమున్న దృష్ట్యా ఇక్కడ ఈ మాత్రం సజ్జనుల వల్ల ఒరిగేదేమీ ఉండదు.

ఇలాంటి చోట ఈ మహా కార్యాన్ని తమ జీవిత లక్ష్యంగా చేసుకోగలిగే యోధులు కావాలి. వారు జీవనోపాధికోసం ప్రపంచ పనులు ఎన్ని చేపట్టినా ఈ ఒక్క

లక్ష్యం కోసమే జీవిస్తారు. దీనికోసమే వారు అంకితమయిపోతారు. ఈ లక్ష్యసాధనలో వారు దృఢ మనస్కులయి ఉంటారు. దానికోసం వారు తమ సమయం, సంపద, శక్తి సామర్థ్యాలు అన్నీ వెచ్చించటానికి సదా సన్నద్ధులై ఉంటారు. చివరికి ప్రాణాలకు తెగించి పాటుపడేందుకైనా వారు వెనుదీయరు. అజ్ఞాన వ్యవస్థా కీకారణ్యాన్ని కూకటి వ్రేళ్ళతో పెకలించి ఇస్లామీయ వ్యవస్థా మార్గాన్ని సుగమం చేయడానికి ఇలాంటి వ్యక్తులే పనికొస్తారు.

దైవధర్మం గురించి సరయిన అవగాహన, దానిపై అచంచల విశ్వాసం, దానికి అనుగుణమైన ఉన్నత శీలం, దాని సంస్థాపనా కార్యాన్ని జీవిత లక్ష్యంగా చేసుకోవడం – ఇవన్నీ నిజానికి ఇస్లామీయ జీవన సౌధ నిర్మాణం కోసం పని చేయదలచుకున్న ప్రతి వ్యక్తిలోనూ ఉండి తీరవలసిన మౌలిక లక్షణాలు. ఇలాంటి లక్షణాలు కలిగి ఉండే వ్యక్తులు గనక లభించకపోతే సంఘ సంస్కరణాకార్యం గురించిన ఆలోచనే నిరర్థకం. దీన్నిబట్టి ఈ గుణగణాలకు ఎంత ప్రాముఖ్యముందో ఊహించవచ్చు.

ఇలాంటి వ్యక్తులు ధర్మ సంస్థాపన కోసం ఏదైనా చేయదలచుకుంటే వారంతా కలసి ఒక సంస్థగా ఏర్పడి పనిచేయవలసిన ఆవశ్యకతను గురించి నొక్కి చెప్పవలసిన అవసరం లేదు. వారు ఏ సంఘం (జమాఅత్)లో ఉన్నా, ఏ పేరుతో పనిచేసినాసరే మొత్తం మీద ఈ పని చేయాలి. సామూహిక వ్యవస్థలో కేవలం వ్యక్తిగత ప్రయత్నాల వల్ల ఎలాంటి మార్పు రాదనేది వివేచనాపరులకు తెలిసిన విషయమే. దానికోసం చెదరిన కృషి కాదు, సమీకృత కృషి కావాలి. ఈ వాస్తవం దృష్ట్యా ఇలాంటి సంఘం లేదా సంస్థలో పనిచేసే వ్యక్తులకు ఉండవలసిన సామూహిక లక్షణాలేమిటో ఇప్పుడు తెలుసుకుందాం.



# 3. సామూహిక లక్షణాలు

## 1. పరస్పర ప్రేమ, సౌభ్రాతృత్వాలు

ఇలాంటి సంస్థ (జమాఅత్) కోసం కావలసిన మొట్టమొదటి లక్షణం - దాని సభ్యులు పరస్పరం ప్రేమాభిమానాలు కలిగి ఉండాలి. ఒకరి పట్ల మరొకరికి త్యాగభావం ఉండాలి. ఏదైనా ఒక భవనం పటిష్ఠంగా ఉండి నాలుగు కాలాల పాటు మనగలగాలంటే, దాని ఇటుకలు ఒకదానికొకటి గట్టిగా కరచుకొని ఉండాలి. అలా ఇటుకల్ని దృఢంగా కలిపి ఉంచగలిగే వస్తువు సిమెంట్ అన్న సంగతి తెలిసిందే. అదేవిధంగా ఒక సంస్థలోని సభ్యుల హృదయాలు కూడా పరస్పరం పెనవేసుకుని ఉండాలి. అప్పుడే ఆ సంఘం కంచుకోటలా దృఢంగా ఉంటుంది. అలా హృదయాల్ని కలిపి ఉంచగలిగే వస్తువు నిస్వార్థ ప్రేమ, పరస్పర సానుభూతి శ్రేయోభిలాష, తాగ్యభావాలు మాత్రమే.

ద్వేష పూరిత హృదయాలు ఎన్నటికీ ఒక దానికొకటి చేరువ కాలేవు. కపట ప్రేమాభిమానాల వల్ల నిజమైన ఐకమత్యం ఏర్పడే అవకాశమే లేదు. స్వార్థపూరితమైన సమైక్యత వంచనకు దారితీస్తుంది. ప్రేమాభిమానాలు లేని సంబంధాల వల్ల నిజమైన మైత్రికి పునాదులు ఏర్పడవు. ఏదైనా ప్రాపంచిక లక్ష్యం కోసం ఇలాంటి వ్యక్తులు కలిసినా వారు విడిపోవడానికే ఏకమవుతారన్న సంగతి మనం గ్రహించాలి. వారు నిర్మాణాత్మకమైన పని ఏదీ చేయలేరు సరికదా పరస్పర కలహాల్లోనే మునిగిపోతారు.

చిత్తశుద్ధి, ధ్యేయనిష్ఠ, భావస్వచ్ఛత కలిగిన వ్యక్తులు పరస్పరం ఒకచోట చేరినప్పుడు పటిష్ఠమైన సంస్థ ఉనికిలోకి వస్తుంది. భావపరమైన ఈ చిత్తశుద్ధి, ధ్యేయనిష్ఠలే వారి మధ్య నిజమైన ప్రేమాభిమానాల్ని సృజిస్తాయి. అలాగే అలాంటి వ్యక్తులతో కూడిన సంఘం వాస్తవానికి ఓ పటిష్ఠమయిన కంచుకోటలాంటిది. ఈ కోటలో సంక్షోభం, గందరగోళం సృష్టించడం ఏ షైతాన్‌కు కూడా సాధ్యపడదు. ఒకవేళ వాడు బయటి నుండి వ్యతిరేకతా తుఫాన్ బీభత్సాలను తెచ్చి పడేసినా అది తన స్థానం నుంచి ఒక్క అంగుళమైనా చలించదు.

## 2. పరస్పర సలహా సంప్రతింపులు

సంస్థ (జమాఅత్)కు ఉండవలసిన రెండవ సామూహిక లక్షణం పరస్పర సలహా సంప్రతింపులు. సభ్యులు పరస్పరం సలహా సంప్రతింపులతో నిర్ణయాలు తీసుకోవాలి. సంప్రతింపుల నియమాలను ఎల్లప్పుడూ దృష్టిలో పెట్టుకోవాలి. తమ ఇష్టమొచ్చినట్లు ప్రవర్తించే తలబిరుసు సభ్యులుండే సంస్థ సరయిన సంస్థ అనిపించుకోదు. దాన్ని కేవలం కొందరు వ్యక్తులు గుమికూడిన ఒక ముఠా అని మాత్రమే చెప్పగలం. దానివల్ల ఏ పనీ కాదు. అలాగే ప్రభావం, పలుకుబడులుగల కొందరు వ్యక్తులతో కూడిన ఒక వర్గం ఉండి, మిగిలిన వారంతా దాని చెప్పుచేతల్లో ఉండి పనిచేసే సంస్థ కూడా ఎంతోకాలం మనజాలదు.

సంస్థలో సలహా సంప్రతింపుల ద్వారానే పని సరిగా నెరవేరగలుగుతుంది. సలహా సంప్రతింపుల వల్ల సభ్యులు ప్రతి విషయాన్ని కూలంకషంగా చర్చించి దాన్ని వివిధ కోణాల నుంచి పరిశీలించి ఒక మంచి నిర్ణయానికి రాగలుగుతారు. అంతేకాదు, దానివల్ల మరో రెండు ప్రయోజనాలు కూడా ఉన్నాయి. ఒకటి, ఏ పని విషయంలోనయినా సంస్థలోని సభ్యులందరి అభిప్రాయాలు ప్రత్యక్షంగానో పరోక్షంగానో చేరి ఉంటాయి గనక, ఆ పనిని మొత్తం సంస్థ సంతృప్తికరమైన హృదయంతో నిర్వహించటానికి కృషి చేస్తుంది. పైగా ఇది సంస్థ తీసుకున్న సమిష్టి నిర్ణయమయినందున ఈ విషయాన్ని తమ మీద బలవంతంగా రుద్దారన్న భావన ఏ ఒక్క సభ్యుడిలోనూ జనించదు.

రెండు, ఈ పద్ధతి వల్ల మొత్తం సంఘానికి విషయావగాహన అబ్బుతుంది. ప్రతి సభ్యుడు సంస్థ వ్యవహారాల పట్ల తగిన శ్రద్ధ తీసుకుంటాడు, సంస్థ తీసుకునే నిర్ణయాల పట్ల తన బాధ్యతలేమిటో గ్రహిస్తాడు. అయితే సంప్రతింపులతో పాటు, సంప్రతింపుల నియమాలను కూడా ప్రతి సభ్యుడు పాటించవలసి ఉంటుంది.

సంప్రతింపుల నియమాలంటే ప్రతి సభ్యుడూ నిజాయితీతో తన అభిప్రాయాన్ని వ్యక్తపరచాలి. మనసులో ఒకమాట దాచి, పైకి మరోమాట వెలిబుచ్చకూడదు. తన మాటే నెగ్గాలన్న మంకుతనం ఉండకూడదు. మెజారిటీ సభ్యుల అభిప్రాయంతో సంస్థ ఒక నిర్ణయం తీసుకున్నప్పుడు దాంతో విభేదించే వ్యక్తులు తమ అభిప్రాయాల్ని

మార్చుకోకపోయినా, సంస్థ నిర్ణయాన్ని మనస్ఫూర్తిగా అమలుపరచటానికి కృషి చేయాలి. అలా చేయకపోతే సలహా సంప్రతింపుల వల్ల ఒనగూడే ప్రయోజనాలన్నీ వృధా అవుతాయి. పైపెచ్చు ఈ ధోరణి క్రమంగా తీవ్రమవుతూ చివరికి సంస్థనే చీల్చివేస్తుంది.

## 3. క్రమశిక్షణ, నియమబద్ధత

ఇది మూడవ సామూహిక లక్షణం. సంస్థలో క్రమశిక్షణ (పార్టీ డిసిప్లిన్) ఉండాలి. సభ్యులందరూ క్రమశిక్షణ, నియమబద్ధత పరస్పర సహకార భావాలతో ఒక 'టీమ్'లా పని చేయాలి. సంస్థలో ఎన్ని మంచి లక్షణాలు ఉన్నా కేవలం క్రమశిక్షణ లోపించినందువల్ల అది తన నిర్ణయాలను, పథకాలను అమలుపరచడంలో విఫలమవుతుంది. సాధారణంగా ప్రతి సంస్థలో వైఫల్యానికి ప్రధాన కారణం క్రమశిక్షణ, పరస్పర సహకారాల లోపమేనన్న సంగతి అందరికీ తెలిసిందే.

గందరగోళం సృష్టించడం చాలా సులువు. కాని సమాజ పునర్నిర్మాణ కార్యం సంఘటితమైన కృషి లేకుండా నెరవేరదు. సంఘటిత కృషి అంటే నిర్దేశిత నియమావళిని మొత్తం సంస్థ పాటించవలసి ఉంటుంది. సంస్థలో ఎవరిని ఏ స్థాయి నాయకుడిగా నియమించినా కార్యకర్తలు అతని పట్ల పూర్తి విధేయత కలిగి ఉండాలి. సంస్థలోని ప్రతి వ్యక్తీ కర్తవ్య పరాయణుడయి, తనకు అప్పగించిన బాధ్యతను సక్రమంగా సకాలంలో నిర్వహించేందుకు కృషి చేయాలి. కార్యకర్తలు కలసిమెలసి సామూహికంగా చేయవలసిన పనిని ఒకరి కొకరు సహకరించుకుంటూ చేయాలి.

ఏదైనా యంత్రాన్ని పని చేయించదలచినప్పుడు మీట నొక్కగానే ఆ యంత్రంలోని వివిధ భాగాలు ఒక్క పెట్టున చకచకా పని చేయడం ప్రారంభిస్తాయి. అదేవిధంగా సంస్థ ఏదైనా విషయం గురించి ఒక నిర్ణయం తీసుకోగానే కార్యకర్తలందరూ రంగంలోకి దూకి దాన్ని తక్షణమే అమలుపరచటానికి ప్రయత్నించాలి. ప్రపంచంలో ఏదైనా సామూహిక కార్యం నెరవేరుతుందంటే అది ఇలాంటి సంస్థల ద్వారానే నెరవేరుతుంది. సంస్థలో తగిన క్రమశిక్షణ, నియమబద్ధత, సమయపాలనా భావాలే గనక లేకపోతే అలాంటి సంస్థ ఉన్నా ఒకటే లేకపోయినా ఒకటే. సంస్థ అనే ఈ యంత్రంలో కావలసిన వివిధ భాగాలు ఉన్నప్పటికీ, వాటిని సమన్వయపరచి సక్రమంగా నిర్వహింపజేయడానికి ఎలాంటి ఏర్పాట్లు లేవన్నమాట.

## 4. సద్విమర్శ

సంస్థలో ఉండవలసిన చివరి సామూహిక లక్షణం, సద్విమర్శ. అసలు ఇదే అన్నిటికన్నా అతి ముఖ్యమైన లక్షణం. ఏదైనా విషయంపై విమర్శించవలసి వస్తే సంస్కరణా ఉద్దేశంతో మాత్రమే దాన్ని విమర్శించాలి. వ్యక్తులపై దాడి చేయకుండా నేర్పుగా చాకచక్యంగా విమర్శించాలి.

అమాయకులతో, అంధానుకరణకు అలవాటు పడిన వ్యక్తులతో నిండిన వర్గం ఎంతటి ఉన్నత లక్ష్యాన్ని ఎంచుకున్నా, ఎలాంటి మంచి దృక్కోణం నుండి పని ప్రారంభించినా అది చివరికి విచ్ఛిన్నం దిశలోనే పయనిస్తుంది. కారణం మనిషి చేసే పనిలో పొరపాట్లు దొర్లడం సహజం. ఆ పొరపాట్లను గ్రహించే వారు ఎవరూ లేకపోతే, లేదా వాటిని ఎత్తి చూపడం తప్పన్న భావం ఉంటే అలాంటి చోట ఏమరుపాటు వల్లనో లేక గత్యంతరం లేని పరిస్థితుల కారణంగానో పొరపాటు మామూలయి పోతుంది. పైగా ప్రతి పొరపాటు మరిన్ని పొరపాట్లను జనింపజేస్తూ పోతుంది.

సంస్థ ఆరోగ్యానికి, అభివృద్ధికి, విమర్శలను ఆహ్వానించడం, వాటిని ప్రోత్సహించడం ఎంతో అవసరం. విమర్శలను స్వాగతించలేని సంస్థ క్రమేణా అనారోగ్యానికి ఆలవాలమై పోతుంది. విమర్శను అణచివేసే ధోరణికన్నా మించిన సంస్థాగత ద్రోహం మరేదీ ఉండదు. విమర్శను ప్రోత్సహించినప్పుడే సంస్థకు ఎదురయ్యే చెడును సకాలంలో నివారించి దాన్ని సంస్కరించటానికి వీలుంటుంది.

అయితే అది ఎల్లప్పుడూ సద్విమర్శయి ఉండాలి. దాని వెనుక ఎలాంటి దురుద్దేశం, దురాలోచన, దురభిమానాలు మాత్రం ఉండకూడదు. చిత్తశుద్ధితో, సంస్కరణాభిలాషతో మాత్రమే విమర్శించాలి. దాంతో పాటు మరో ముఖ్యమైన విషయం కూడా ఉంది. విమర్శించదలచిన వ్యక్తికి విమర్శనా కౌశల్యం కూడా ఉండాలి. చిత్తశుద్ధి, సంస్కరణాభిలాష ఎంత ఉన్నప్పటికీ విమర్శనా కౌశలం లేకుండా సందర్భ రహితంగా, మొరటుగా విమర్శనాస్త్రాలు ప్రయోగిస్తే దానివల్ల సంస్థకు నష్టమేగాని ప్రయోజనం ఏమాత్రం చేకూరదు. దురుద్దేశంతో తప్పులెన్నే వారివల్ల సంస్థకు ఎంత నష్టం వాటిల్లుతుందో మొరటు విమర్శకుల వల్ల కూడా అంతే నష్టం వాటిల్లుతుంది.



# 4. కార్యనిర్వాహక లక్షణాలు

సమాజ సంస్కరణకు, ఇస్లామీయ జీవన వ్యవస్థ నిర్మాణానికి సంబంధించిన పని కోసం ఎలాంటి లక్షణాలు కలిగిన వ్యక్తులు అవసరమో, ఆ వ్యక్తులతో కూడిన సంస్థలో ఎలాంటి సామూహిక లక్షణాల ఆవశ్యకత ఉందో మనం గత పుటలలో తెలుసుకున్నాం.

ఈ విషయంలో ఇప్పటి వరకు ప్రస్తావించిన గుణగణాలన్నీ కేవలం సంస్థ (జమాఅత్)కు కావలసిన ప్రాథమిక లక్షణాలు మాత్రమే. ఏదైనా వ్యాపారం చేయడానికి కనీస పెట్టుబడి కావలసి ఉంటుంది. కనీస పెట్టుబడి లేకుండా వ్యాపారాన్ని అసలు ప్రారంభించనేలేము. అదేవిధంగా ఈ పని కోసం కూడా కనీసపు నైతికంగా పెట్టుబడి ఎంతో అవసరం. ఈ మాత్రం నైతికతా పెట్టుబడి పని ప్రారంభ దశలోనే కావలసి ఉంటుంది. అది లేకుండా పనిలోకి దిగడం వృధా ప్రయాస.

ఇస్లాం అంటేనే ఏమిటో తెలియకపోతే, లేదా తమ దైనందిన జీవితంలో తమ నీతి నడవడికల ద్వారా దాన్ని అమలుపరచలేని శక్తిహీనులయితే, లేదా దానిపట్ల సరయిన అవగాహన, మానసిక ఏకాగ్రత, సంతృప్తులే లేకపోతే, లేదా దీని సంస్థాపనా కృషిని తమ జీవిత ధ్యేయంగానే పరిగణించకపోతే – ఇలాంటి వ్యక్తుల వల్ల ఇస్లామీయ జీవన వ్యవస్థ నెలకొంటుందని ఎన్నటికీ ఆశించలేము.

అలాగే ఈ ప్రాథమిక లక్షణాలు కలిగి ఉన్న వ్యక్తులు ఒక పనికోసం ప్రోగయినప్పటికీ వారి మనసులు పరస్పరం కలవకపోతే, వారిలో క్రమశిక్షణ, నియమబద్ధత, పరస్పర సహకార భావాలే లేకపోతే, కలసిమెలసి పనిచేసే పద్ధతే తెలియకపోతే, పరస్పరం సంప్రతించుకుని నిర్ణయాలు తీసుకోవడం, సద్విమర్శల ద్వారా సకాలంలో లోపాలను సరిదిద్దడం వంటి విషయాలనే వారెరుగకపోతే ఎలాంటి ప్రయోజనం ఉండదు. ఇలాంటి వ్యక్తులు ప్రోగయినంత మాత్రాన వారితో ఏర్పడిన సంస్థ ఎలాంటి సత్ఫలితాన్నీ ఇవ్వదు.

అందువల్ల లోగడ పేర్కొన్న నాలుగు వ్యక్తిగత లక్షణాలు, నాలుగు సామూహిక

లక్షణాలు వాస్తవానికి ధర్మసంస్థాపనా కార్యానికి కావలసిన ప్రారంభ పెట్టుబడి మాత్రమేనన్న విషయం మనం గ్రహించాలి. వీటికుండే ప్రాముఖ్యత ఎలాగూ ఉంది. అయితే ఈ పని ముందుకు సాగడానికి, వృద్ధి చెంది విజయవంతమవడానికి కేవలం ఈ కనీసపు నైతికతా పెట్టుబడి మాత్రమే సరిపోదు, ఇంకా ఎన్నో లక్షణాలతో కూడిన నైతికతా పెట్టుబడి కావలసి ఉంటుంది.

సమాజ సంస్కరణ, ధర్మసంస్థాపనా లక్ష్యాలను సాధించడానికి ఇంకా అదనంగా కావలసిన లక్షణాలేమిటో ఇప్పుడు తెలుసుకుందాం :

## 1. దైవంతో సంబంధం - చిత్తశుద్ధి

వీటిలో అన్నిటికంటే మొట్టమొదటి లక్షణం - దైవంతో మన సంబంధం, కేవలం ఆయన ప్రసన్నత కోసమే పని చేయాలన్న చిత్తశుద్ధి. ప్రపంచంలో ఇతర పనులెన్నో ప్రజలు తమ కోసమో, తమ వంశం లేదా జాతి కోసమో చేస్తారు. స్వలాభాల కోసం, భౌతిక ప్రయోజనాల కోసం ఎన్ని దుష్ట ఆలోచనలతోనైనా పనిచేయవచ్చు. అందులో వారు సఫలమవడం కూడా సాధ్యమే. కాని ఇస్లామీయ జీవన వ్యవస్థను నెలకొల్పే పని అంత తేలికయినది కాదు. మనిషికి దేవునితో సరయిన సంబంధం ఏర్పడి, అది పటిష్ఠవంతం కానంతవరకు, కేవలం దేవుని ప్రసన్నత కోసమే పని చేయాలన్న సత్సంకల్పం లేనంత వరకు అతను ఈ పనిలో విజయం సాధించలేడు.

ఇక్కడ మనిషి ఎన్నుకున్న పని ఓ మహోన్నతమైన దైవకార్యం. ఇస్లామీయ జీవన వ్యవస్థ సంస్థాపనం. దీనికోసం అతను ఏది చేయదలచినా దేవుని కోసమే చేయవలసి ఉంటుంది. ఆయన ప్రసన్నతనే కోరుకోవలసి ఉంటుంది. ఈ పని వెనుక ప్రేరణ దేవుని పట్ల ప్రేమాభిమానాలే అయి ఉండాలి. ఆయన సహాయం, అనుగ్రహాలపైనే ఆధారపడాలి. ఆయన ప్రసాదించే ప్రతిఫలం మీదనే ఆశలన్నీ పెట్టుకోవాలి. ఆయన బోధనల్నే అనుసరించాలి. ఆయన ఆజ్ఞలే శిరసావహించాలి.

ఏదైనా తప్పు జరిగితే కలిగే పర్యవసానం విషయంలో దేవునికి మాత్రమే భయపడుతూ ఉండాలి. ఆయనకు తప్ప ఇతరులకు భయపడటం, ఇతరులు చూపే ప్రలోభాలకు లొంగిపోవడం, ఇతరుల ఆదేశాలను పాటించటం, ఇతరుల విధానాలను

అనుకరించడం, ఇతరుల ప్రేమాభిమానాలు మనసులో తిష్ఠవేయడం, ఇతరుల మెప్పు గుర్తింపుల కోసం ప్రాకులాడటం, ఇతర ఉద్దేశాలతో పని చేయడం మొదలైనవన్నీ మనిషిని సన్మార్గం నుండి తప్పిస్తాయి. ఇలాంటి దృక్పథాలతో పనిచేయడం వల్ల దైవ ధర్మ సంస్థాపనం సాధ్యం కాదు.

## 2. పరలోక చింతన

పై లక్షణానికి అతి సన్నిహితమైన లక్షణం పరలోక చింతన. విశ్వాసి (మోమిన్) కార్యక్షేత్రం ఈ ప్రపంచమే అయినప్పటికీ, అతను ఏది చేయవలసి వచ్చినా ఇక్కడే చేయవలసి ఉన్నప్పటికీ ఆ పనిమాత్రం పరలోకం కోసమే చేస్తాడు; ఇహలోకం కోసం చేయడు. అతని దృష్టి అంతా పరలోక ఫలితాలపైనే ఉంటుంది. కాని, ఇహలోక ఫలితాలపై ఉండదు.

అతను పరలోకంలో తనకు ప్రయోజనం చేకూర్చే ప్రతి పనీ చేయాలి. పరలోకంలో తనకు ప్రయోజనం చేకూర్చని ప్రతి కార్యానికి దూరంగా ఉండాలి. అలాగే పరలోకంలో నష్టాన్ని తెచ్చిపెట్టే ప్రతి ప్రాపంచిక ప్రయోజనాన్ని తృణీకరించాలి. పరలోకంలో ప్రయోజనం చేకూర్చగలిగే ప్రతి ప్రాపంచిక నష్టాన్నీ భరించాలి. అతను ఎల్లప్పుడూ పరలోక ప్రతిఫలం పరలోక శిక్షల్ని గురించే ఆలోచించాలి. ఇహలోక ప్రతిఫలానికి, ఇహలోక శిక్షలకు అతను ఏమాత్రం ప్రాముఖ్యమివ్వకూడదు.

ఈ ప్రపంచంలో అతని ప్రయత్నాలు సఫలమయినా, విఫలమయినా, అతను చేసే పనికి ప్రశంసలు లభించినా, విమర్శలు వచ్చినా ఇక్కడ అతను బహుమానాలు పొందినా, కఠిన పరీక్షలకు గురయినా వాటికి ప్రాధాన్యతనివ్వడంలో తన దృష్టినంతటినీ పరలోక పర్యవసానాల మీదనే కేంద్రీకరించాలి. తన శ్రమ, ప్రయత్నాలన్నింటినీ దేవుడు చూస్తూనే ఉన్నాడని, వాటికి పరలోకంలో ఆయన శాశ్వత ప్రతిఫలం తప్పకుండా అనుగ్రహిస్తాడని అతను గట్టిగా నమ్మాలి. పరలోక సాఫల్యమే అసలు సాఫల్యమని దృఢంగా విశ్వసించాలి. ఈ విశ్వాసం ఈ మనస్తత్వం లేకుండా మనిషి ధర్మ సంస్థాపనా మార్గాన సరయిన దిశలో ఒక్క అడుగయినా ముందుకు వేయలేడు.

దైవకార్యం వెనుక ప్రాపంచిక వ్యామోహం, ఎంత అల్పస్థాయిలో ఉన్నా మనిషి

పాదాలు ఈ మార్గంలో తడబడకుండా ఉండలేవు. ప్రపంచ ప్రయోజనాలే లక్ష్యంగా పెట్టుకున్న వ్యక్తి దైవమార్గంలో ఒకటి రెండూ కాకపోతే నాలుగైదు ఎదురు దెబ్బలు తిన్నా చాలు, అతని ధైర్యం సన్నగిల్లిపోతుంది. అంతేకాదు, అలాంటి వ్యక్తి ఈ మార్గంలో ఏదైనా ప్రయోజనం సాధించగలిగినా అది అతని ప్రవర్తనా తీరును సయితం చెడగొడ్తుంది.

## 3. సచ్ఛీలం, సద్వర్తనం

పై రెండు లక్షణాలకు తోడు ధ్యేయ పథాన్ని మరింత సుగమం చేయగల శక్తిమంతమయిన మరో లక్షణం సచ్ఛీలం. దైవమార్గంలో పనిచేసే వారికి సహన గుణం, ఉదార స్వభావం ఉండాలి. తోటి దైవదాసుల పట్ల సానుభూతి, శ్రేయోభిలాషలు కలిగి ఉండాలి. జాలిగుండె, సాధు స్వభావం వారి నైజంలో వేళ్ళూనాలి. ఆత్మాభిమానం, ఆత్మ సంతృప్తి వారి స్వభావంలో చోటుచేసుకోవాలి. సౌమ్యత, సుహృద్భావం, సభ్యత, సంస్కారాలు వారి సహజ గుణాలయి ఉండాలి. మృదు భాషణతో వారి మాటల్లో మాధుర్యం జాలువారాలి. వారి ప్రవర్తన ఇతరులకు ఎలాంటి హాని కలిగించనిదయి ఉండాలి.

వారు సజ్జనులు, శ్రేయోభిలాషులన్న భావన ప్రతి ఒక్కరిలో కలగాలి. వారు తమకు నష్టం వాటిల్లినా ఇతరులకు ప్రయోజనం చేకూర్చగలిగే సహృదయులని, చెడుకు చెడుతో సమాధానమివ్వని సహనశీలురని, ఇతరుల బలహీనతల్ని పొరపాట్లను క్షమించగలిగే విశాల హృదయులని ప్రజానీకంలో ఒక సదభిప్రాయం ఏర్పడి పోవాలి.

ఈ సత్య పథగాముల నోట ఎల్లప్పుడూ సత్యమే వెలువడాలి. వారు సత్యం కోసం తమ సర్వస్వాన్ని ధారపోసే త్యాగ ధనులయి ఉండాలి. సత్యమార్గంలో తమకు ఇతరులు నష్టం కలగజేసినా వారు మాత్రం ప్రతీకారవాంఛతో వివశులైపోకూడదు. లోకమంతా ఏకమయి ప్రశంసించినా, దూషించినా పట్టించుకోకుండా తమ కర్తవ్య నిర్వహణలోనే వారు సదా నిమగ్నులయి ఉండాలి. వారు తమ కృషికి ప్రపంచ ప్రజల నుండి గాక దైవం నుండే ప్రతిఫలాన్ని ఆశించేవారయి ఉండాలి.

వారు బలప్రయోగాలకు లొంగిపోనివారుగా, సిరిసంపదలకు

అమ్ముడుపోనివారుగా ఉండాలి. అయితే సత్యం, సన్మార్గాల ముందు ఎలాంటి తటపటాయింపు లేకుండా తలవంచేవారయి ఉండాలి. అంతటి నైతికశక్తి కలిగిన సత్పురుషులు నీతి, నిజాయితి, న్యాయం, ధర్మాలకు వ్యతిరేకంగా ఎలాంటి దుష్టచర్యకూ పాల్పడలేరని వారి శత్రువులు సయితం వారిని నమ్ముతారు.

ఇవి హృదయాలను చూరగొనే ఉత్తమ గుణగణాలు. ఇవి కత్తికన్నా పదునైన నైతిక ఆయుధాలు. వీటి పెట్టుబడి ధన కనక వస్తువులకన్నా ఎంతో విలువైనది. ఇలాంటి సద్గుణ సంపత్తి కల వ్యక్తి తన పరిసర ప్రజానీకం మనసుల్ని సులువుగా గెలుచుకుంటాడనడంలో ఎలాంటి సందేహం లేదు. ఇక మొత్తం ఇలాంటి సుగుణవంతులతోనే నిండిన సంస్థ ఏదైనా ఉండి ఒక మహదాశయం కోసం పనిచేస్తే అది యావత్తు దేశాన్ని ప్రభావితం చేస్తుంది. దాన్ని ప్రతిఘటించగల శక్తి ఏదీ ప్రపంచంలోనే ఉండదు.

## 4. సహనం, సుస్థిరత

పై మూడు లక్షణాలే గాక, ముఖ్యమైన మరో మూడో లక్షణం కూడా ఉంది. అదే సహనం. ఇదొక విస్తృత భావంతో కూడిన పదం. అంటే దీనికి అనేక అర్థాలున్నాయి. దైవమార్గంలో పని చేసేవారు ఈ అర్థాలన్నిటి రీత్యా ఎంతో సహనశీలురయి ఉండాలి.

సహనం అంటే ఒక అర్థం - మనిషికి తొందరపాటు స్వభావం ఉండకూడదు. తన ప్రయత్నాల ఫలితాలను వెంటనే త్వరత్వరగా చూసేందుకు ఆరాటపడకూడదు. ఫలితాలు వెలువడటానికి ఆలస్యం అవుతున్నందుకు ధైర్యం వీడకూడదు. సహనశీలి తన జీవిత కాలమంతా తాను ఎన్నుకున్న లక్ష్యం కోసమే నిరంతరం పాటుపడుతుంటాడు. తాను చేస్తున్న ప్రయత్నాలు వరుసగా విఫలమయిపోతున్నా అధైర్యం చెందకుండా కర్తవ్య నిర్వహణలోనే ఉండిపోతాడు. ప్రజా సంస్కరణ, సమాజ పునర్నిర్మాణాలకు సంబంధించిన పనిని చేపట్టిన వ్యక్తికి ఇలాంటి సహన గుణమే గనక లేకపోతే అతను తన లక్ష్యాన్ని ఎన్నటికీ సాధించలేడు.

సహనానికి రెండో అర్థం సుస్థిర స్వభావం. మనిషి అధైర్యం, పిరికితనం,

ఊగిసలాట, బలహీన సంకల్పం తదితర రుగ్మతలు లేని స్థిరచిత్తుడయి ఉండాలి. తాను అన్ని విధాలా ఆలోచించి ఎంచుకున్న మార్గంలోనే అతను స్థిరంగా ఉండి, దృఢ మనస్సుతో, దీక్షా కంకణం కట్టుకుని పూర్తి శక్తిని కేంద్రీకరించి ఆ మార్గంలో పురోగమిస్తూ ఉండాలి.

సహనానికి మరో అర్థం కష్టాలను ఎదుర్కోవడం. ఎన్ని కష్టాలు వచ్చిపడినా, మరెన్ని ఆపదలు విరుచుకుపడినా, ఎలాంటి నిరాశా నిస్పృహలకు లోనుకాకుండా వాటిని ధైర్యంతో ఎదుర్కోవాలి. ధ్యేయమార్గంలో ఎలాంటి కష్టాలు ఎదురయినా ప్రశాంత మనస్సుతో వాటిని భరించాలి. సహనశీలి ఎలాంటి తుఫాను దెబ్బలకు, అలల తాకిడికి భయపడని సాహసవీరుడు.

సహనానికి వేరొక భావం సౌమ్యం, సౌమనస్యం. ఎలాంటి పరిస్థితిలోనూ మనిషి ఉద్రేకానికి లోనుకాకుండా ప్రశాంత హృదయంతో వ్యవహరించాలి. సంస్కరణ, పునర్నిర్మాణాల పని చేయదలచిన వ్యక్తి భావోద్రేకాలకు వివశుడయి పోకూడదు. ముఖ్యంగా దశాబ్దాలుగా చెడులు వ్రేళ్ళూనుకుని ఉన్న సమాజంలో ఈ మహాకార్యాన్ని నిర్వహించవలసి వచ్చినప్పుడు అతి నీచమైన, అసభ్యకరమైన ప్రతిఘటనలు సహజంగానే ఎదురవుతాయి. ఇలాంటి సమయాల్లో కూడా కార్యకర్త ఎంతో సంయమనంతో వ్యవహరించవలసి ఉంటుంది. ప్రత్యర్థులు దూషించినా చిరునవ్వు చిందించాలి. వారి ఎత్తిపొడుపు మాటల్ని ఖాతరు చేయకూడదు. అపనిందలు, అపవాదాలు, అబద్ధాలు, అసత్య ఆరోపణలు, దూషణలు, దుష్ప్రచారాలు నలువైపుల నుంచి తుఫానులా విరుచుకుపడినా ప్రశాంత హృదయంతో వాటిని భరిస్తూ మౌనంగా తన పని తాను చేసుకుంటూ పోవాలి. కార్యకర్తకు ఆ మాత్రం ఓరిమి లేకపోతే అతను ఈ రంగంలో అడుగుపెట్టవలసిన అవసరమే లేదు.

జీవితం సంతోషంగా, సుఖంగా సాగిపోవడానికి ఇది పూలు పరచిన రాచబాట కాదు. ఇది అడుగడుగునా ముళ్ళపొదలతో నిండిన అత్యంత కఠినమైన ఇరుకు దారి. ఈ దారిన నడిచే ప్రతి వ్యక్తినీ అవి రక్కివేస్తూ ఒక్క అంగుళం కూడా ముందుకు సాగనియ్యవు. అందువల్ల కార్యకర్త ఎంతో మెలుకువతో వీటి బారినుండి తప్పించుకుంటూ గమ్యం వైపునకు పురోగమించాలి. ఒకవేళ తన దుస్తుల్లో ఏదైనా ముళ్ళమండ చిక్కుకుంటే

ఆ మేరకు వస్త్రాన్ని చించిపారేసి ముందుకు సాగాలి. అంతేగాని దాన్ని తొలగించే ప్రయత్నంలో ఆగిపోయి తన విలువైన సమయాన్ని వృథా చేసుకుంటూ వస్త్రం మరింత చిరిగిపోవడానికి ఆస్కారమివ్వకూడదు.

ఈ సహనం కేవలం ప్రత్యర్థుల ముందు మాత్రమే ప్రదర్శించవలసిన సద్గుణం కాదు. ఒక్కోసారి ఈ మార్గంలో పయనించే తోటి వారి వల్ల, చివరికి తన అనుయాయుల వల్ల కూడా అతనికి చేదు అనుభవాలు ఎదురు కావచ్చు. అలాంటి పరిస్థితిలో కూడా అతను సహనం, సంయమనాలను పాటించాలి. లేకపోతే సంస్థ లక్ష్యానికే ప్రమాదం వాటిల్లవచ్చు.

సహనం అంటే ఎలాంటి భయప్రలోభాలకు లోను కాకుండా రుజుమార్గంలో స్థిరంగా ఉండటం అని కూడా అర్థం ఉంది. కార్యకర్త షైతాన్ ఎత్తుగడలన్నిటినీ చిత్తుచేస్తూ తన మనోవాంఛల విషపుకోరల్ని పెరికివేస్తూ తన కర్తవ్య నిర్వహణలో ముందుకు సాగిపోవాలి. అధర్మ విషయాలకు దూరంగా మసలుకుంటూ, దైవాజ్ఞల పరిధికి లోబడి ఉండిపోవాలి. దుష్కార్యాల్లో గోచరించే సమస్త రుచులను, మాధుర్యాలను కాలదన్నాలి. సద్వర్తనం, సత్కార్యాల పర్యవసానంగా ఎదురయ్యే ప్రతి నష్టాన్ని సంతోషంగా భరించాలి. ప్రపంచ పూజారులు అనుభవిస్తున్న భోగభాగ్యాల వైపు కన్నెత్తి కూడా చూడకూడదు. వాటిని అనుభవించాలన్న తలంపునకు తన హృదయంలో లేశమయినా చోటివ్వకూడదు. ప్రపంచ వ్యామోహాలకు దాని తళుకు బెళుకులకు దూరంగా ఉంటూ, దైవానుగ్రహం వల్ల ధర్మ సమ్మతమైన మార్గం ద్వారా తనకు లభించిన కొద్దిపాటి ప్రాపంచిక వస్తు సామగ్రితోనే సంతృప్తి చెంది సంతోషంగా ఉండాలి.

సహనానికి సంబంధించిన ఈ భావాలన్నిటి దృష్ట్యా ఆయా లక్షణాలన్నీ కార్యకర్తల్లో నిబిడీకృతమయి ఉండాలి. ఏ ఒక్క విధంగానయినా అసహనం వెలిబుచ్చితే దాని పరిణామాలు ఘోరంగా ఉంటాయి.

## 5. నేర్పు, యుక్తి

ఈ నాలుగు లక్షణాలతో పాటు అతి ముఖ్యమైన మరో లక్షణం కూడా ఉంది.

అదే నేర్పు లేక యుక్తి. సంస్థ విజయం ఎక్కువగా దీని మీదే ఆధారపడి ఉంటుందని చెప్పవచ్చు. ప్రపంచంలో ప్రస్తుతం నెలకొని ఉన్న జీవన వ్యవస్థల్ని మేధా సంపన్నులు, తెలివితేటలు గలవారే నిర్వహిస్తున్నారు. వారి వెనుక భౌతిక వనరులతో పాటు బుద్ధిబలం, సైద్ధాంతిక శక్తి, శాస్త్రీయ కళా శక్తులన్నీ పని చేస్తున్నాయి. వారి సమక్షంలో మరో కొత్త జీవిత వ్యవస్థను నెలకొల్పడం, దాన్ని విజయవంతంగా నడిపించడం అంటే చిన్నపిల్లల ఆట కాదు. దైవనామాన్ని జపిస్తూ మఠాల్లో కూర్చునే సాధుపుంగవులు చేసే పని కాదిది.

కల్లాకపటం ఎరుగని అమాయకులు ఎంతటి సజ్జనులైనా, వారి సంకల్పం ఎంత మంచిదైనా, ఈ పనిని సాధించలేరు. దీనికోసం సుదూరదృష్టి, సునిశిత పరిశీలనా జ్ఞానం, వివేచనా పటిమ, వ్యవహారావగాహనా శక్తి ఎంతో అవసరం. సమయోచితమైన నిర్ణయాలు తీసుకోగలిగే వారు, జీవిత సమస్యల్ని అర్థం చేసుకుని పరిష్కరించే సామర్థ్యం కలిగినవారు, రాజనీతి దురంధరులు మాత్రమే ఈ పని చేయగలుగుతారు. ఈ లక్షణాలన్నీ కూడిన సమగ్ర పదమే కౌశలం.

యుక్తి, వివేకం, బుద్ధికుశలతలు కలిగిన వ్యక్తి మనుషుల మనస్తత్వాలను అర్థం చేసుకోగలుగుతాడు, వారిపట్ల ఎలా మసలుకోవాలో అతనికి బాగా తెలుసు. తన సందేశ ప్రచారంతో వారిని ఎలా ఆకట్టుకోవాలో, తన లక్ష్య సాధన కోసం వారిని ఎలా ఉపయోగించుకోవాలో అతనికి తెలుసు. అతను ప్రతి వ్యక్తికీ ఒకే విధమైన మందుతో చికిత్స చేయడానికి ప్రయత్నించడు. ప్రతి ఒక్కరి వ్యాధిని, ఆ వ్యాధి లక్షణాల్ని తెలుసుకుని, దాని ప్రకారం ఎవరికి ఏ మందివ్వాలో అదే ఇచ్చి చికిత్స చేస్తాడు. అతను అందర్నీ ఒకే గాటన కట్టడు. తనకు ఎలాంటి వ్యక్తులు, ఎలాంటి వర్గాలు, జాతులవారు, తటస్థపడతారో వారి ప్రత్యేక పరిస్థితులేమిటో, విశేష లక్షణాలేమిటో తెలుసుకుని తదనుగుణంగా వారిపట్ల వ్యవహరిస్తాడు.

తెలివైన వ్యక్తికి తాను చేపట్టిన పనేమిటో, దాన్ని నిర్వహించవలసిన పద్ధతులేమిటో తెలుసు. తన మార్గంలో ఎదురయ్యే అవరోధాలను, వ్యతిరేకతలను, ప్రతిఘటనలను ఎలా ఎదుర్కోవాలో కూడా అతనికి తెలుసు. తాను ఏ లక్ష్యసాధన కోసం నడుం బిగించాడో దాని కోసం ఏం చెయ్యాలి, ఎలా చెయ్యాలి, ఎలాంటి అడ్డంకుల్ని ఏ

విధంగా తొలగించుకోవాలో కూడా అతనికి తెలిసి ఉండాలి. ఈ లక్షణం కూడా 'కౌశలం' క్రిందికే వస్తుంది.

వర్తమాన పరిస్థితులపై దృష్టి సారించడం, సమయ సందర్భాలను గమనిస్తూ ఉండటం, ఎప్పుడు ఏ విధానం అవలంబించాలో దాన్ని గ్రహించడం కూడా 'కౌశల్యం'గానే పరిగణించబడుతుంది. పరిస్థితుల్ని అర్థం చేసుకోకుండా గుడ్డిగా రంగంలోకి దూకడం, సమయ సందర్భాలు గమనించకుండా పనిచేయడం, సదవకాశం లభించినప్పుడు చేతులు ముడుచుకొని కూర్చోవడం మొదలైనవన్నీ అజాగ్రత్తపరులు చేసే పనులు. ఇలాంటి వ్యక్తులు ఎంతటి మంచి ఆశయం కోసం పనిచేసినా, ఎంతమంది ఉద్దేశంతో పని చేసినా ప్రయోజనం ఉండదు. వారు తమ లక్ష్యసాధనలో ఎన్నటికీ విజయం సాధించలేరు.

వీటన్నిటికీ మించిన కౌశలం మరొకటి ఉంది. మనిషి ధార్మిక విషయాల్లో విచక్షణా జ్ఞానం, లౌకిక వ్యవహారాల్లో దూరదృష్టి కలిగి ఉండాలి. ధర్మాదేశాలను, షరీఅత్ సమస్యలను తెలుసుకుని, వాటిని తనకు ఎదురయ్యే జీవిత సమస్యలకు అన్వయింపజేసే అంతటి సామర్థ్యమయితే ఒక షరీఅత్ వేత్తకు సరిపోతుంది. కాని పతనావస్థలో ఉన్న సమాజాన్ని సంస్కరించడానికి, జీవన వ్యవస్థలోని అజ్ఞాన అనాగరిక విషయాలను కూకటి వ్రేళ్ళతో పెళ్ళగించి దాన్ని ధార్మిక పునాదులపై పునర్నిర్మించడానికి ఈ మాత్రం సామర్థ్యం సరిపోదు.

ఈ పని కోసం ఇస్లాం బోధనలకు సంబంధించిన సాధారణ అంశాలు మొదలుకుని, కీలక అంశాల దాకా యావత్తు ధర్మ వ్యవస్థపై పరిశీలనా దృష్టి కలిగి ఉండాలి. ధార్మిక బోధనలు, ఆదేశాలతో పాటు వాటి మర్మ హేతువులు కూడా మనిషికి తెలిసి ఉండాలి. అంతేకాకుండా ఈ బోధనలను, ఆదేశాలను అమలుపరచడానికి వర్తమాన పరిస్థితుల్ని, వాటి సమస్యల్ని కూడా అర్థం చేసుకోగల మేధాశక్తి అతనికి ఉండాలి.

ప్రత్యేక లక్షణాలకు సంబంధించిన ఈ జాబితాను చూసీచూడగానే మనిషి భయపడిపోయి, ఇది మహనీయులు మాత్రమే చేయగలిగే పని అని, సామాన్యులకు ఇలాంటి ఉన్నత లక్షణాలు ఎలా అబ్బుతాయని తలుస్తాడు. కాని ఇది అపోహ మాత్రమే. ఈ లక్షణాలన్నీ ప్రతి వ్యక్తిలోను ఉన్నత ప్రమాణంలో తప్పనిసరిగా

ఉండాలన్న నియమం ఏదీ లేదు. అదీగాక ఈ లక్ష్యసాధన ఉద్యమంలో అడుగుపెట్టగానే మనిషి అన్ని విధాలా సుశిక్షితుడయి ఉండాలన్న నియమం కూడా ఏదీ లేదు. అసలు విషయం ఆయా లక్షణాలకు సంబంధించిన 'సరుకు' మనిషి వ్యక్తిత్వంలో ఉందా లేదా అన్న దాన్ని గురించే ఆలోచించాలి.

ధర్మసంస్థాపనా ఉద్యమం చేపట్టినవారు ఇది "జాతి సేవకు సంబంధించిన ఒక పని" అని మాత్రమే భావించి మౌనంగా ఉండకూడదు. తమ అంతరంగాల్లోకి తొంగి చూసి అసలు ఈ లక్షణాలకు సంబంధించిన 'సరుకు' తమలో ఉందా లేదా అని తెలుసుకోవడానికి ప్రయత్నించాలి. ఒకవేళ అలాంటి సరుకు ఏదైనా ఉంటే పని ప్రారంభించడానికి అది చాలు. దాన్ని పోషించటం, తమకున్న శక్తి సామర్థ్యాలతో దాన్ని వీలైనంత మేరకు పెంపొందించడం అనేది ఆ తరువాత ఘట్టాలకు సంబంధించిన పని.

నేలలో నాటిన విత్తనం మొలకెత్తి గాలి, నీరు, సేంద్రీయ పదార్థాలు గ్రహిస్తూ క్రమంగా పెరిగి బలమైన వృక్షంగా రూపొందడం మనకందరికీ తెలిసిన విషయమే. కాని విత్తనం అన్నదే అసలు లేకపోతే వృక్షం సంగతే తలెత్తదు. అదేవిధంగా లక్ష్యసాధనకై అవసరమయిన లక్షణాలకు సంబంధించిన "సరుకు" గనక మనిషిలో ఉండినట్లయితే, తగిన కృషి చేయడం ద్వారా దాన్ని క్రమేణా పెంపొందింపజేస్తూ పరిపక్వ దశకు తీసికెళ్ళవచ్చు. మనిషిలో అసలు ఆ "సరుకే" లేకపోతే, ఎంత కృషి చేసినా, శిక్షణ ఇచ్చినా దాన్ని సృజించలేము.

ఇప్పటి వరకు పేర్కొన్న విషయాల సారాంశం ఒక్కటే – సంస్కరణ, నిర్మాణాల పని కోసం ఒక కార్యక్రమం ఎంత అవసరమో, ఈ పని కోసం తగిన గుణగణాలు, లక్షణాలు కలిగిన కార్యకర్తలు ఉండటం అంతకంటే ఎంతో ఎక్కువ అవసరం. సామాజిక విప్లవమార్గంలో, ధర్మ సంస్థాపన ఉద్యమంలో ఎదురయ్యే కఠిన పరీక్షల్ని ఎదుర్కోవడానికి కార్యక్రమంలోని అంశాలు కాదు కావలసింది. ఉద్యమంలో దిగిన కార్యకర్తల వ్యక్తిగత, సామూహిక గుణగణాలే ముఖ్యమయినవి. అందువల్ల మనం కార్యక్రమాన్ని రూపొందించే ముందు ఈ పనికోసం ఎలాంటి కార్యకర్తలు అవసరమో పరిశీలించాలి. ఆ కార్యకర్తలు ఎలాంటి లక్షణాలు కలిగిన వారయి ఉండాలి. ఏ ఏ బలహీనతలు, చెడుగులు లేనివారయి ఉండాలి. వారిని ఉద్యమం కోసం సమాయత్తపరచడానికి కావలసిన ఒనరులేమిటి మొదలైన విషయాల్ని గురించి క్షుణ్ణంగా

ఆలోచించాలి. కార్యకర్తల్లో ఉండవలసిన లక్షణాలను మూడు భాగాలుగా విభజించవచ్చు.

ఒకటి – ఈ పనిలో పాల్గొనే ప్రతి వ్యక్తిలోనూ పునాదిరాళ్ళుగా ఉండవలసిన మౌలిక లక్షణాలు. ఇవి నాలుగు రకాలు. 1. ధర్మం పట్ల సరయిన అవగాహన. 2. దానిపై ప్రగాఢ విశ్వాసం. 3. వాటికి అనుగుణమైన సచ్ఛీలం సద్గుణ సంపత్తి. 4. ధర్మ సంస్థాపనాన్ని జీవిత ధ్యేయంగా చేసుకోవడం.

రెండు – ఈ సేవకై ఉద్యమించే సంస్థలో ఉండవలసిన సామూహిక లక్షణాలు. ఇవి కూడా నాలుగు రకాలు. 1. పరస్పర ప్రేమాభిమానాలు, పరస్పర నమ్మకం, చిత్తశుద్ధి, సానుభూతి శ్రేయోభిలాష, పరస్పర త్యాగం. 2. పరస్పర సలహా సంప్రతింపులతో పని చేయడం, సలహా సంప్రతింపులకు సంబంధించిన ఇస్లామీయ నియమాలను పాటించడం. 3. క్రమశిక్షణ, సమయ పాలన, నియమనిబద్ధత, పరస్పర సహకారం, టీమ్‌స్పిరిట్. 4. సరయిన తీరులో సద్విమర్శ. అంటే సంస్థలో ఏర్పడే లోపాలు మరింత జటిలమయి, మరిన్ని లోపాలకు, చెడులకు కారణభూతం కాని విధంగా సరయిన రీతిలో సద్విమర్శలు చేయడం ద్వారా వాటిని ఎప్పటికప్పుడు నివారించడానికి ప్రయత్నించడం.

మూడు – ధర్మ సంస్థాపనా ఉద్యమాన్ని సరయిన పంథాలో నడపటానికి, దాన్ని విజయ శిఖరాలకు చేర్చడానికి తప్పనిసరిగా కావలసిన ప్రత్యేక లక్షణాలు. ఇవి అయిదు రకాలు. 1. దేవునితో దృఢమైన సంబంధాలు, ఆయన ప్రసన్నత కోసం పని చేయాలన్న ఆకాంక్ష. 2. పరలోకంలో మన కర్మలకు దైవం ఎదుట లెక్క చూపవలసి ఉంటుందన్న నిరంతర చింతన, పరలోక ప్రతిఫలంపై తప్ప మరే ఇతర వస్తువులపై దృష్టి ఉంచకపోవడం. 3. సచ్ఛీలం, సద్గుణాలు, 4. సహనం, సంయమనాలు. 5. వివేకం, యుక్తి, కౌశల్యం.

ఇప్పుడు మనం ఈ మహోన్నత ఆశయం కోసం పని చేసే కార్యకర్తల్లో ఉండకూడని ముఖ్యమైన మౌలిక దోషాలు, దుర్గుణాలేమిటో తెలుసుకుందాం.



# 5. మౌలిక దోషాలు

## 1. గర్వం, అహంకారం

ప్రతి మంచిని కూకటి వ్రేళ్ళతో సహా పెళ్ళగించివేసే అతి ప్రమాదకరమైన మొదటి దోషం గర్వమే. అహంకారం, పొగరు, తలబిరుసుతనం, విర్రవీగడం, ప్రగల్భాలు పలకడం, తనను తాను పొగడుకోవడం మొదలయినవన్నీ ఈ కోవకే చెందుతాయి. ఇది పూర్తిగా దుష్ట (షైతాన్) ప్రేరణ. దుష్టచేష్టల కోసమే ఇది తగుతుంది. దీన్ని దగ్గర పెట్టుకుని మంచి పని ఏదీ చేయలేం.

నిజానికి ఔన్నత్యం ఆధిక్యతలన్నీ దేవునికే చెల్లుతాయి. దాసుల ఆధిక్యతా భావం ఓ మిథ్య మాత్రమే. అందులో వాస్తవమన్నది ఏమాత్రం లేదు. గర్వాంధకారంలో పడిన ప్రతి వ్యక్తీ, ప్రతి వర్గం దైవసహాయానికి దూరమయిపోతాడు. దాసుల అహంకారం దైవాగ్రహానికి కారణభూతమవుతుంది. గర్వాంధకారికి ప్రబోధనా జ్యోతి కనిపించదు. అతనికి దైవం నుండి సన్మార్గ సద్బుద్ధి లభించదు. అతను ఎల్లప్పుడు అజ్ఞాన చేష్టలకు, తెలివిమాలిన పనులకే పాల్పడుతుంటాడు. ఆ గర్వాంధకారంలోనే కొట్టుమిట్టాడుతూ, చివరికి పరాభవాలు చవిచూస్తాడు.

అహంకారం అనేక అనర్థాలను తెచ్చిపెడ్తుంది. అహంకారిని ప్రజలు అసహ్యించుకుంటారు. అతనిలో అహంభావం పెరిగినకొద్దీ జనంలో అతనిపట్ల ద్వేషం కూడా పెరుగుతుంది. చివరికి ప్రజలపై అతని నైతిక ప్రభావం ఏమాత్రం లేకుండా పోతుంది.

మంచి కోసం పని చేసేవారిపై ఈ రోగం అనేక కోణాల నుంచి దాడిచేస్తుంది. సంకుచితమనస్కులపై ఈ వ్యాధి వారి ధార్మిక, నైతిక పరిస్థితి ప్రజల పరిస్థితి కన్నా కాస్త మెరుగవగానే విజృంభిస్తుంది. వీరు కాస్త చెప్పుకోదగిన సేవ కూడా చేస్తారు. అయితే దాన్ని ప్రజలు గుర్తించి పొగడటం ప్రారంభించగానే షైతాన్ వారి హృదయాల్లోకి చేరి, నువ్వు నిజంగానే గొప్ప వాడయి పోయావంటూ కలతలు సృష్టిస్తాడు. షైతాన్ ప్రేరణ వల్లనే ఇలాంటి వ్యక్తి తన గొప్పదనాన్ని తన మాటల ద్వారా, చేష్టల ద్వారా

ఇతరుల ముందు వెలిబుచ్చుకోవడానికి వెంపర్లాడుతాడు. ఈ విధంగా సదుద్దేశంతో ప్రారంభమయిన అతని పని క్రమంగా వక్రమార్గానపడి దారుణ పరిణామాలకు దారితీస్తుంది.

అహంకారం మనిషిపై మరో కోణం నుంచి కూడా దాడి చేస్తుంది. స్వీయ సంస్కరణతో పాటు ప్రజల సంస్కరణ కోసం చిత్తశుద్ధితో ప్రయత్నించే వ్యక్తులకు సహజంగానే కొన్ని మంచిగుణాలు అబ్బుతాయి. వారి నైతిక స్థితి సమాజంలోని ఇతర ప్రజలకన్నా కాస్త మెరుగ్గానే ఉంటుంది. వారు చేసే సేవలు కూడా కొద్దోగొప్పో చెప్పుకోదగినవిగా ఉంటాయి. మొత్తం మీద ఇవి దాగని వాస్తవాలు. అయితే కాస్తంత ఏమరుపాటు వల్ల, షైతాన్ గాలి సోకగానే వారిలో అహంభావం, ఆత్మ స్తుతుల ఛాయలు తొంగిచూస్తాయి. అంతేకాదు, ఒక్కొక్కసారి ప్రత్యర్థుల అపనిందల్ని ఎదుర్కోవడంలో జరిగే అజాగ్రత్త వల్ల కూడా ఈ ఛాయలు తొంగిచూస్తాయి.

ప్రత్యర్థులు వీరు చేసే సేవలపైనే గాకుండా, వీరి వ్యక్తిత్వాలపై కూడా బురదచల్లడానికి ప్రయత్నిస్తారు. అప్పుడు ఈ నీలాపనిందల రొంపి నుండి బయటపడేందుకు వారు విధిలేక కొన్ని విషయాలు చెప్పవలసి వస్తుంది. ఈ విషయాలు వాస్తవాలే అయినప్పటికీ వాటిని వెలిబుచ్చడంలో సమతూకం అణుమాత్రం తప్పినా, ఈ వైఖరి వారిని అహంభావం పరిధిలోకి లాక్కెళుతుంది. ఇది చాలా ప్రమాదకరమైన విషయం.

## దైవదాస్య భావన

సమాజ సంస్కరణకు సమాయత్తమయిన సంస్థ, ఆ సంస్థలోని ప్రతి సభ్యుడూ దైవదాస్య భావన విషయంలో ఎంతో జాగరూకుడై ఉండాలి. ప్రతి సభ్యుడిలో వ్యక్తిగతంగా, సంస్థలో సాముదాయికంగా దైవ దాస్య భావన సదా సజీవంగా, సచేతనంగా ఉండాలి. ప్రశంసలు, పొగడ్తలు ఒక్క విశ్వ ప్రభువుకు మాత్రమే ప్రత్యేకించబడ్డాయన్న యదార్థాన్ని వారు ఏనాడూ విస్మరించకూడదు. దాసుని స్థాయి దేవుని దాస్యం చేయడానికీ, ఆయన్ని దీనంగా అర్థించడానికి మించి మరేమీ లేదు.

ఒక దాసునిలో ఏదైనా మంచి అన్నది నిజంగా ఉన్నా, అది దైవానుగ్రహం

వల్ల ప్రాప్తమయిన సంపద మాత్రమే. అందువల్ల అది గర్వించదగిన విషయం ఎంత మాత్రమూ కాదు, అది దైవానికి కృతజ్ఞతలు అర్పించవలసిన విషయం. అలాంటి భాగ్యం లభించినందుకు ఆ దాసుడు మరింత దీనంగా తన నిస్సహాయ స్థితిని ఏకరువు పెట్టుకుంటూ ఆయన సన్నిధిలో మోకరిల్లాలి. అంతేకాకుండా అతను దైవమార్గంలో కొంత సొమ్ము ఖర్చుపెట్టడం కూడా సమంజసంగా ఉంటుంది. దానివల్ల అతనిపై మరింత దైవానుగ్రహం వర్షించే అవకాశముంటుంది. మంచిని పొంది గర్వపడటమంటే చెడు నుండి ప్రతిఫలం తీసుకోవడమే. ఇది అతడ్ని ప్రగతి వైపునకు గొనిపోయే విషయం కాదు, పతనానికి దిగజార్చే విషయం మాత్రమే.

## ఆత్మ పరిశీలన

దాస్యభావన తరువాత మనిషిని అహంకార రుగ్మత నుండి కాపాడగలిగే రెండో విషయం - ఆత్మ పరిశీలన. తన స్థానం ఏమిటో, తనలో ఉన్న మంచి ఏమిటో, తన బలహీనతలేమిటో, తనలో ఏ ఏ లోపాలున్నాయో తన అంతరంగంలోకి తొంగి చూసుకునే వ్యక్తి ఎన్నటికీ అహంకారం, ఆత్మస్తుతుల రుగ్మతలకు గురికాలేడు. తన పాపాలను, పొరపాట్లను ఎవరైనా ఎత్తి చూపిస్తే అతను దైవాన్ని మన్నింపు వేడుకోవడంలో నిమగ్నుడయిపోతాడు. తత్ఫలితంగా అతని మస్తిష్కంలో అహంకారపు గాలి కూడా చొరబడే అవకాశముండదు.

## గొప్పవారిపై దృష్టి

తనకంటే గొప్పవారిపై దృష్టి సారించడం వల్ల కూడా మనిషి అహంకార రుగ్మత నుండి తనను కాపాడుకోగలుగుతాడు. మనిషి తన క్రింది స్థాయి వ్యక్తుల లోపాలతో తన లోపాలను పోల్చుకుని తన పరిస్థితి ఫరవాలేదని తలచి సంతోషిస్తాడు. కాని అంతటితో తృప్తి చెందకుండా తనకంటే గొప్పవారిలో ఉండే నైతికతా వైఢూర్యాలను, ధార్మికతా మాణిక్యాలను కూడా చూడాలి. నైతిక, ఆధ్యాత్మిక పతనం పరిమితి లేనిది. వాటి ప్రగతి కూడా పరిమితి లేనిదే. అందువల్ల ఎంత గొప్పవాడయినాసరే క్రింది వైపునకు చూస్తే తనకంటే అల్పుడు కన్పించినప్పుడు అతను తన ఆధిక్యతను చూసుకొని అహంకారానికి లోనయ్యే ప్రమాదం ఉంది.

ఈ అహంకారం పర్యవసానంగా అతను తన ప్రస్తుత పరిస్థితితో తృప్తి చెంది తనను తాను మరింత బాగుపరచుకునే ప్రయత్నాన్ని మానేస్తాడు. ఈ ధోరణి అంతటితో ఆగిపోదు. అతని మనోవాంఛల దుష్టశక్తి అతని చెవిలో గుసగుసలాడుతూ, క్రిందికి దిగడానికి ఇంకా అవకాశముందని దుర్బోధ చేస్తుంది. ఇలాంటి వైఖరిని స్వయంగా తమ ప్రగతీ వికాసాలకు విరోధులయిన వారే అవలంబిస్తారు.

ప్రగతిని మనస్ఫూర్తిగా కోరుకునేవారు ఎల్లప్పుడూ తమ క్రింది వారిని చూడకుండా పైనున్న వారినే చూస్తారు. వారు చేరుకున్న ప్రతి ప్రగతి సోపానం పైన వారికి మరిన్ని సోపానాలు కనిపిస్తాయి. కాని వారు తాము చేరుకున్న సోపానాలను చూసి గర్వపడటానికి బదులు తాము ఎక్కివచ్చిన క్రింది మెట్లు, ఇంకా నడవాల్సిన పై మెట్లు చూసి, 'కాస్త దూరమే వచ్చాం, నడవాల్సిన దూరం ఇంకా చాలా ఉందే!' అని ఆందోళన చెందుతారు. ఈ ఆందోళనే వారిని మరిన్ని సోపానాలు అధిరోహించడానికి ప్రేరణ ఇస్తుంది.

వీటన్నిటితో పాటు సంస్థ (జమాఅత్) సంస్థాగతంగా కూడా అహంకారపు ధోరణి వల్ల అనుక్షణం అప్రమత్తంగా ఉండాలి. సంస్థ పరిధిలో ఏ ఏ కోణాల నుండి అహంకారపు నీలి నీడలు కమ్ముకుంటాయో ఓ కంట కనిపెడుతూ వాటిని సకాలంలో అంతమొందించడానికి సత్వర చర్యలు తీసుకోవాలి. అయితే సంస్థ సభ్యుల్లో కృత్రిమ వినయం, కపట విధేయతా భావం ఏర్పడేందుకు ఆస్కారమిచ్చే పద్ధతుల ద్వారా వీటి నివారణకు ప్రయత్నించకూడదు. వినయం, అణకువల ముసుగు వేసుకున్న అహంకారం బహిరంగ అహంకారం కన్నా ఎంతో నీచమైనది.

## 2. ప్రదర్శనా బుద్ధి

మంచిని సర్వనాశనం చేసే రెండవ దోషం - ప్రదర్శనాబుద్ధి. గర్వం తెచ్చే కీడు కంటే ఇది ఏమాత్రం తక్కువ కాదు. మంచికోసం పాటుపడే వ్యక్తి ప్రజల ప్రశంసల్ని అందుకోవాలన్న తలంపుతో ఆ పని చేస్తే దాన్నే ప్రదర్శనాబుద్ధి అంటారు. ఈ దుర్బుద్ధి సంకల్పశుద్ధికి పూర్తిగా వ్యతిరేకమైనది. పైగా అది విశ్వాసానికి కూడా విరుద్ధమైనది. అందుకే ప్రదర్శనాబుద్ధిని "దాగి ఉన్న షిర్క్"గా పరిగణించడం జరిగింది.

దైవాన్ని, పరలోకాన్ని విశ్వసించిన వారు ఏ పని చేసినా దైవప్రసన్నత కోసమే పనిచేయాలి. తాము చేసే పనులకు ప్రతిఫలం దైవం నుండే ఆశించాలి. ప్రపంచ ఫలితాలకు బదులు పరలోక ఫలితాలపైనే దృష్టి ఉంచాలి.

ప్రదర్శనాబుద్ధి కలవాడి దృష్టి ఎల్లప్పుడూ లోకుల మెప్పు మీదనే ఉంటుంది. వారి నుండే అతను తన ప్రతిఫలాన్ని ఆశిస్తాడు. ప్రపంచంలోనే తనకు ప్రతిఫలం దక్కాలని, ప్రపంచంలోనే తనకు పేరు పలుకుబడులు, కీర్తి ప్రతిష్ఠలు లభించాలని కోరుకుంటాడు. అంటే అతను దేవుని దైవత్వంలో ఆయన దాసుల్ని సహవర్తులుగా చేస్తున్నాడన్నమాట. లోకుల మెప్పుకోసం ప్రాకులాడటమంటే దైవానికి సాటి కల్పించడమే. అలాంటి వ్యక్తి ధర్మ సంస్థాపనా కృషిలో ఎలాంటి సేవలు అందజేసినా అవి దైవధర్మం కోసం చేసిన సేవలు కాజాలవు. అవి దేవుని దృష్టిలో పుణ్యకార్యాలుగా కూడా పరిగణించబడవు.

ఈ దుర్బుద్ధి మన సదాచరణల్ని నాశనం చెయ్యడమే గాక, దీన్ని దగ్గర పెట్టుకుని ఏ మంచి పనినయినా సరయిన రీతిలో సవ్యంగా చేయడం సాధ్యం కాదు. ఈ దుర్లక్షణం ఉన్న మనిషికి పని మీద ధ్యాసకన్నా ప్రచార చింతే ఎక్కువగా ఉంటుంది. పేరు ప్రఖ్యాతులు తెచ్చిపెట్టే పనే సరయిన పని అని అతను భావిస్తాడు. ప్రశంసలు కురిపించే పని అంటేనే అతనికి ఇష్టం. దైవానికి తప్ప ఇతరుల దృష్టిలో పడలేనటువంటి పనికి అతని దగ్గర ఎలాంటి విలువ లేదు. ఈ విధంగా మనిషి కార్యక్షేత్రం ప్రచారాన్ని తెచ్చిపెట్టే పనులకు పరిమితమయిపోతుంది. ప్రచార ఉద్దేశం నెరవేరిన తరువాత ఆ పనుల మీద కూడా అతనికి ఆసక్తి లేకుండా పోతుంది. అతనికి కావలసిందల్లా ఈ పేరు ప్రచారాలే. అలాంటప్పుడు అతను కోరుకున్న పేరు ప్రచారాలు లభించాక ఇక ఆ పనినే పట్టుకుని ఎందుకు వ్రేళ్ళాడుతాడు?

పని ప్రారంభంలో మనిషి ఎంత చిత్తశుద్ధితో తన క్రియా జీవితాన్ని ప్రారంభించినా, ఈ జాడ్యం అంటుకోగానే అతని చిత్తశుద్ధి అంతా హారతి కర్పూరంలా హరించుకుపోతుంది. ఆ తరువాత అతను రంగం నుండి తప్పుకున్నా నీతిగా ఉండాలనుకుంటే అదీ సాధ్యం కాదతనికి. పైగా ఏదైనా పనిని తన కర్తవ్యమని భావించినా దాన్ని నిర్వహించడం అతని వల్ల కాదు. తాను చేయదలచుకున్న ప్రతి

పనిలోనూ పేరు ప్రశంసలే ఆశిస్తాడు. ప్రతి వ్యవహారంలోనూ లోకులకు ఎలాంటి వైఖరి అంటే ఇష్టం? అని మాత్రమే అతను ఆలోచిస్తాడు. తనను ప్రజల్లో నిరాదరణకు గురిచేసే పనిని గురించి అతను ఆలోచించనయినా ఆలోచించలేడు. నిజానికి అదే అతను చేయవలసిన పని అని అతని అంతరాత్మ ప్రబోధించినా సరే, అతను ఆ పని గురించిన ఆలోచననే తన మనస్సులోకి రానివ్వడు.

ఏకాంత కుహరాల్లో కూర్చుని అల్లాహ్, అల్లాహ్ అంటూ ధ్యానం చేసుకునే వారికైతే ఈ ఉపద్రవం నుంచి కాపాడుకోవడం కాస్త సులువే. కాని ప్రజల మధ్యకొచ్చి సమాజసేవ, ధర్మసంస్థాపనా కార్యం చేసే వారికి ఈ అనైతిక విషక్రిములు తమపై ఏ క్షణంలో దాడి చేస్తాయోనన్న భయం అనుక్షణం పట్టి పీడిస్తూనే ఉంటుంది. ఏమయినప్పటికీ వారు ప్రజల దృష్టిలో పడే పనులు అనేకం చేయవలసి వస్తుంది. ముఖ్యంగా ప్రజల్ని తమ ఆశయానికి అనుకూలంగా మలచుకోవడానికి, లక్ష్య సాధనకై వారిలో పలుకుబడి సంపాదించడానికి ఈ పనులు చేయడం వారికి అనివార్యమవుతుంది. అదీగాక ప్రజానీకాన్ని ఆకట్టుకునే పనులు ప్రజల నోట ప్రశంసా వచనాలు పలికించే పనులు కూడా కొద్దో గొప్పో వారు చేయవలసి వస్తుంది.

మరోవైపు ప్రత్యర్థుల నుంచి ములుకుల్లాంటి పలుకులు కూడా వారు వినవలసి వస్తుంది. అప్పుడు ఈ దుష్ప్రచార ఊబి నుండి బయట పడేందుకు, నిరాధారమైన ఈ ఆరోపణల్ని తిప్పికొట్టేందుకు తాను చేసిన చేస్తున్న మంచి పనులు కొన్నింటిని తమకు ఇష్టం లేకపోయినా బహిరంగపరచవలసి వస్తుంది. ఇలాంటి పరిస్థితుల్లో ఖ్యాతిని రానిచ్చి ఖ్యాతి జాడ్యానికి గురికాకుండా మసలుకోవడం, ప్రదర్శనను జరగనిచ్చి ప్రదర్శనా దుర్బుద్ధికి దూరంగా ఉండడం, ప్రజాదరణకు అవకాశమిచ్చి ప్రజాదరణ వాంఛను మనసులో రేకెత్తనీయకుండా చేయడం, ప్రశంసలకు దారిచ్చి ప్రశంసలు పొందాలన్న దురాలోచనకు తావీయకుండా ఉండటం అంటే సామాన్య విషయాలు కావు. ప్రదర్శనాబుద్ధి జనింపజేసే ఎన్నో సాధనాలు నలువైపులా చుట్టుముట్టి ఉన్నా ఈ ప్రపంచంలో ప్రదర్శనా వాంఛ రొంపి నుండి కాపాడుకోవడం ఎంతో కష్టంతో కూడిన పని. దీనికోసం అమితమైన శోధన, శ్రమ, శ్రద్ధ అవసరం. ఏకాస్త ఏమరుపాటు వహించినా ఈ వ్యవహారంలోకి ప్రదర్శనాభావ విషక్రిములు దారి చేసుకునే ప్రమాదం ఉంది.

## వ్యక్తిగత ప్రయత్నం

దీని బారి నుండి తప్పించుకోవడానికి వ్యక్తిగత ప్రయత్నంతో పాటు సామూహిక ప్రయత్నం కూడా చేయాలి. వ్యక్తిగతంగా ప్రతి కార్యకర్త వీలైనంత మేరకు గుప్తంగా ఉండేటటువంటి కొన్ని సత్కార్యాలు చేయడం అలవరచుకోవాలి. దీంతో పాటు తనకు గుప్త సత్కార్యాల పట్ల ఎక్కువగా ఆసక్తి ఉందా లేక బహిరంగ సత్కార్యాల పట్ల ఎక్కువ ఆసక్తి ఉందా అనే విషయం గురించి కూడా అతను ఎల్లప్పుడూ ఆత్మావలోకనం చేసుకుంటూ ఉండాలి. ఒకవేళ అతనికి బహిరంగ సత్కార్యాల పట్ల ఎక్కువ ఆసక్తి ఉన్నట్లు తోచితే, అతని హృదయంలో ప్రదర్శనాభావం పెంపొందుతోందన్న విషయాన్ని తక్షణమే గ్రహించి దైవాన్ని శరణుకోరాలి. ఆ తరువాత అతను పూర్తి సంకల్ప నిరతితో ఆ దుర్బుద్ధిని రూపుమాపడానికి కృషి చేయాలి.

## సామూహిక ప్రయత్నాలు

ఇక సామూహిక విషయానికొస్తే సంస్థ తన పరిధిలో ప్రదర్శనా భావ విషబీజాల్ని ఎన్నటికీ మొలకెత్తనీయకూడదు. సంస్థ తన కార్యకలాపాలకు సంబంధించిన విషయాల్లో ఏదయినా విషయం ప్రకటించవలసి వస్తే దాన్ని అవసరమయిన మేరకు మాత్రమే ప్రకటించి ఊరుకోవాలి. ప్రదర్శనా దుర్బుద్ధికి సంబంధించిన సూచనలు ఏమాత్రం కనిపించినా వెంటనే వాటిని నిర్మూలించాలి. ఫలానా పని ఎక్కువ ప్రజాదరణ పొందుతుంది గనక దాన్ని అవలంబించాలి, ఫలానా పనిని ప్రజలు మెచ్చుకోరు కాబట్టి దాన్ని చేపట్టకూడదు అనే అభిప్రాయాలకు సంస్థలో ఏమాత్రం ఆస్కారమియ్య కూడదు. ముఖ్యంగా సంస్థాగత చర్యల్లో, సలహా సంప్రతింపుల్లో ఇలాంటి మాటల్ని సూచన ప్రాయంగానయినా సహించకూడదు. సంస్థలో ప్రజల పొగడ్తలకు, ఖండనలకు అతీతమయిన మనస్తత్వం జనించేలా దాని అంతర్గత వాతావరణం నెలకొని ఉండాలి. దూషణలకు క్రుంగిపోయే, ప్రశంసలకు పొంగిపోయే మనస్తత్వాన్ని కూడా ప్రోత్సహించకూడదు. అప్పటికీ సంస్థలో ప్రదర్శనాబుద్ధి దుర్గంధం వెదజల్లే సభ్యులెవరయినా ఉంటే, సంస్థ అలాంటి వారిని ప్రోత్సహించడానికి బదులు వారి రోగనివారణను గురించి ఆలోచించాలి.

## 3. సంకల్పంలో కల్తీ

మూడవ మౌలిక దోషం సంకల్పంలో కల్తీ ఏర్పడటం. సంకల్పంలో కల్తీ ఏర్పడిందంటే ఇక ఎలాంటి సదాచరణా సౌధాన్నీ నెలకొల్పలేం. ప్రపంచంలో 'మంచి' వ్యాప్తి చెందాలనే సదుద్దేశం దాని కోసం కృషి చేసి దైవ ప్రసన్నత పొందాలనే నిష్కళంకమైన సంకల్పం ఉన్నప్పుడు మనం చేసే మంచి పనులు ఫలవంతం అవుతాయి. ఈ సంకల్పంలో వ్యక్తిగతమైన లేదా వర్గపరమైన ఎలాంటి స్వార్థానికీ తావుండకూడదు. అందులో ఎలాంటి ప్రాపంచిక ప్రయోజనమూ పొందే ఉద్దేశం ఉండకూడదు. చివరికి ఏదైనా సాకుతో కూడా స్వార్థ ప్రయోజనాలను ఆశించే జాడ్యం ఈ సదాశయానికి అంటకూడదు.

ఇలాంటి ప్రతి దోషం పరలోకంలో మన సత్కర్మల ఫలాన్ని నాశనం చేస్తుంది. అదీగాక ప్రపంచంలో కూడా ఈ సంకల్ప కాలుష్యాన్ని తీసుకుని ఏ మంచి పనీ చేయలేము. సంకల్పంలోని ఈ కల్తీ మన శీలంపై తప్పనిసరిగా ప్రభావం చూపుతుంది. శీలంలో ఏర్పడే దోషంతో ధర్మసంస్థాపనా లక్ష్యాన్ని సాధించడం సాధ్యమే కాదు. కారణం ధర్మ సంస్థాపన అసలు ధ్యేయం చెడును నిర్మూలించి, మంచిని నెలకొల్పడమే.

పైన సూచించిన చిక్కే మళ్ళీ ఇక్కడ ఎదురవుతోంది. పాక్షిక ప్రయోజనాల కోసం పని చేసే పక్షంలో సంకల్పంలో ఏర్పడే ఈ కల్తీని దూరం చేయడం అంతగా కష్టమైన పనేమీ కాదు. దీనికోసం 'దైవ సంబంధం' మంచి దీక్ష కొంతయినా సరిపోతుంది. అయితే మొత్తం సామాజిక వ్యవస్థను సంస్కరించాలని, దాన్ని ఇస్లాం పునాదులపై పునర్మించాలని లక్ష్యంగా పెట్టుకున్నవారు, తమ లక్ష్యాన్ని సాధించడానికి కేవలం భావాల స్థాపనతో, ప్రచార ప్రసంగాలతో లేదా నైతిక సంస్కరణా ప్రయత్నాలతో తృప్తి చెందకూడదు. దాంతోపాటు ప్రజాజీవన వ్యవస్థ దిశను తమ లక్ష్యం వైపు మరలించడానికి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కృషి చేయవలసి ఉంటుంది. అప్పుడే సంపూర్ణ సమాజ సంస్కరణ సాధ్యమవుతుంది.



# 6. మానవ బలహీనతలు

మౌలిక దోషాల ప్రస్తావన తరువాత ఇప్పుడు ద్వితీయ స్థాయి చెడుగులేమిటో తెలుసుకుందాం. ఇవి మన లక్ష్యం పునాదుల్ని పెకలించలేకపోయినా, వాటి ప్రభావం వల్ల పనులు చెడే ప్రమాదం ఉంది. వీటిని ఉపేక్షిస్తే మరింత ప్రమాదకరంగా పరిణమిస్తాయి. షైతాన్ వీటినే పనిముట్లుగా ఉపయోగించుకుని మన సత్కార్యాల మార్గంలో అవరోధాలను సృష్టిస్తాడు, మానవ యత్నాలను మంచి విషయాల నుండి చెడు వైపునకు మళ్ళించి, సమాజంలో కల్లోలాన్ని రేకెత్తింపజేస్తాడు. సమాజ ఆరోగ్యం కొరకు వీటిని నిర్మూలించవలసిన అవసరం ఎంతైనా ఉంది. ముఖ్యంగా సంఘసంస్కరణ, ధర్మ సంస్థాపనలను మహోన్నత లక్ష్యంగా పెట్టుకున్న వ్యక్తులు, సంస్థలయితే ఈ చెడుల్ని అసలు దగ్గరికే రానివ్వకూడదు.

ఇలాంటి చెడుగుల్ని గురించి కాస్త లోతుగా ఆలోచిస్తే, వీటికి మూలకారణం మానవునిలోని కొన్ని ప్రత్యేక బలహీనతలేనని ఇట్టే తెలుస్తుంది. ఈ బలహీనతల్లో ప్రతి ఒక్కటి మరెన్నో బలహీనతలకు జన్మనిస్తుంది. అవగాహనా సౌకర్యం కోసం, మనం ఒక బలహీనతను తీసుకుని మొదట దాని నిజరూపం, తీరుతెన్ను లేమిటో తెలుసుకుందాం. తరువాత అది క్రమంగా ఎలా ఘోరమైన చెడుగా తయారవుతుందో, ఎంత బలం పుంజుకుని మరెన్ని చెడులకు కారణభూతమవుతుందో పరిశీలిద్దాం. ఈ విధంగా మనం ప్రతి చెడుకు మూలం ఏమిటో, దాన్ని నిరూపణ కోసం ఎప్పుడు ఎలాంటి చికిత్స చేయాలో సులువుగా తెలుసుకోవచ్చు.

## 1. అహంభావం

మానవ బలహీనతల్లోకెల్లా "అహంభావం" అత్యంత ప్రమాదకరమైన బలహీనత. అంతరంగంలో ఉండే స్వాభిమానానికి సంబంధించిన సహజ భావనే దీనికి మూలం. అంతరంగంలోని ఈ సహజ భావన స్వతహాగా చెడ్డ విషయమేమీ కాదు. పైగా అది వికృత రూపం దాల్చనంతవరకు చాలా అవసరం కూడా, ప్రయోజనకరమైనది కూడా. మానవుడు తనను తాను పరిరక్షించుకోవడానికి, తన

వృద్ధీ వికాసాలకై కృషి చేసుకోవడానికి సృష్టికర్త అతని శ్రేయస్సు కోసం అతని నైజంలో ఈ భావనను సృజించాడు. అయితే ఈ భావనే షైతాన్ ప్రేరణతో శృతిమించిన స్వాభిమానం, స్వార్థచింతన, ఆత్మస్తుతి, ఆత్మారాధనలుగా మారిపోతే, మంచికి నిలయం కావడానికి బదులు చెడుకు ఆలవాలమయిపోతుంది. అక్కడితో ఆగకుండా, అది తన పరిణామ క్రమంలోని ప్రతి ఘట్టంలోనూ ఓ కొత్త చెడుగుల పరంపరను సృజిస్తూ పోతుంది.

## ఆత్మ స్తుతి, స్వోత్కర్ష

చెడు వైపునకు దారి తీసే ఈ అహంభావం ప్రారంభంలో బహు విచిత్రంగా ఉంటుంది. మనిషి మొదట్లో తనను తాను ఎలాంటి దోషంలేని పరమ పవిత్రుడనని, సద్గుణ సంపన్నుడనని భావించుకుంటాడు. అతనసలు తనలోని లోపాలను, బలహీనతలను గుర్తించడానికే సిద్ధం కాడు. ప్రతి లోపం లేక దోషం విషయంలో ఏదో సాకుతో మనసుకు సర్ది చెబుతాడు. తాను అన్ని విధాలా ఎంతో ఉత్తముణ్ణని అంతరంగానికి నచ్చజెప్పుకుంటాడు. ఇలా మొదలైన ఈ స్వోత్కర్ష తొలి దశలోనే అతని సంస్కరణ, వికాసాల ద్వారాన్ని అతని చేతులతోనే మూసివేయిస్తుంది.

ఈ మనోమయ భావంతో మనిషి సామూహిక జీవితంలో అడుగుపెట్టినప్పుడు తన కోసం తాను నిర్దేశించుకున్న విషయాల్నే ఇతరులు కూడా తన విషయంలో అర్థం చేసుకోవాలని కోరుకుంటాడు. అతను తనను గురించి ఇతరుల పొగడ్తలను మాత్రమే వినాలనుకుంటాడు. విమర్శల్ని అతను ఏమాత్రం సహించలేడు. శ్రేయోభిలాషలతో చేసే హితోపదేశం వల్ల కూడా అతని అహం దెబ్బతింటుంది. ఈ విధంగా అతను తనకు మేలు చేసే అంతర్గత సంస్కరణా అవకాశాలతో పాటు బాహ్యాపరమైన సంస్కరణా అవకాశాలను కూడా చేజేతులా చెడగొట్టుకుంటాడు.

కాని సామూహిక జీవితంలో అన్ని విధాలా అతనికి నచ్చిన వాతావరణమే ఏర్పడటం అన్నది అసంభవం. ముఖ్యంగా స్వార్థపరుడికి, సొంత డబ్బా వాయించుకునే వాడికయితే సామూహిక వ్యవస్థలో అన్ని వైపుల నుండి చురకలు తగులుతాయి. సమాజంలోని అనేక మంచి విషయాలతో అతడ్ని ఘర్షణకు దించే ఎన్నో కారణాలు అతని 'అహం'లో అంతర్లీనమయి ఉంటాయి. మరోవైపు సమాజంలోని సగటు స్థితిగతులు కూడా అతని ఆశలు ఆకాంక్షలతో అనవసరమైన వైరం పెట్టుకుంటాయి.

ఇలాంటి పరిస్థితుల్లో అతను అంతర్, బాహ్య సంస్కరణా అవకాశాలను పోగొట్టుకోవడమే గాక, బయటి వారి నుండి కూడా ఘర్షణలు, అపజయ బాధలు – దెబ్బతిన్న అతని 'అహం' చేత ఒకదాన్ని మించిన మరొకటి ఘోరమైన తప్పులు చేయిస్తూ ఉంటాయి. అతనికి జీవితంలో అనేకమంది తనకంటే మెరుగైన వారుగా గోచరిస్తారు. సమాజంలో చాలామందికి తనకంటే ఎక్కువగా గౌరవం లభిస్తోందని, తనకు మాత్రం తానాశించిన గౌరవం ప్రాప్తమవడంలేదని భావిస్తాడు. తాను ఏ హోదా అంతస్తులకైతే యోగ్యుణ్ణి అనుకుంటున్నాడో వాటిని తనకు దక్కకుండా అనేకమంది అడ్డు తగులుతున్నారని అనుమానిస్తాడు. చాలామంది తనను విమర్శించడమే పనిగా పెట్టుకున్నారని, పైగా వారు తన వెంటబడి తనలో ఏవేవో లోపాలు వెలికి తీస్తున్నారని తలుస్తాడు.

ఈ పరిస్థితులన్నీ కలసి అతని హృదయంలో కొందరి పట్ల అసూయ, మరికొందరి పట్ల ద్వేషం జనింపజేస్తాయి. అతను ఇతరుల వ్యవహారాలను గురించి ఆరా తీయడానికి తాపత్రయపడుతుంటాడు. ఇతరుల్లో లోపాలు వెతుకుతూ తిరుగుతుంటాడు. ఇతరుల గురించి పరోక్షంగా నిందారోపణలు చేస్తూ ఉంటాడు. ఇతరుల గురించి ఎవరైనా చెడు విషయాలు చెబితే చెవులు రిక్కించి ఎంతో ఆసక్తిగా వింటాడు. చాడీలు చెబుతుంటాడు. కుట్రలు పన్నుతుంటాడు. రహస్య మంతనాలు జరుపుతాడు. ఒండొరుల మధ్య పొరపొచ్చాలు రేపుతాడు.

అతను ఎల్లప్పుడూ ఇలాంటి వ్యాపకాల్లో మునిగి ఉండటం ద్వారా అతని నైతిక బంధనాలు సడలిపోతే, లేదా స్వతహాగానే సడలిపోతే అతను మరికాస్త ముందుకు పోయి అబద్ధాలు చెప్పటం, అపనిందలు మోపటం, అసత్య ఆరోపణం చేయటం వంటి పరమనీచమైన నేరాలకు పాల్పడతాడు. ఈ చెడుల ఊబిలో కూరుకుపోయిన వ్యక్తి అతి హేయమైన నైతిక పతనాగాధంలో పడకుండా ఉండలేడు. అతను స్వయంగా ఏదో ఒక దశలో వెనక్కి తిరిగి, ప్రారంభంలో తాను ఎక్కడ తప్పటడుగువేశాడో గ్రహిస్తే తప్ప ఈ ఊబి నుండి బయటపడలేడు.

ఈ పరిస్థితి ఎవరో ఒక వ్యక్తిలోనే ఉంటే సామూహిక ఉపద్రవమేమీ ముంచుకు రాదు. మహా అయితే అతని ప్రభావం మరికొందరి దాకా చేరి ఆగిపోతుంది. కాని

అహంకార మనస్తత్వం గలవారు చాలామంది ఉంటే, వారి దుష్టస్వభావంతో మొత్తం సామూహిక జీవితంలో అల్లకల్లోలం వ్యాపించిపోతుంది. అసూయా ద్వేషాల విషసర్పాలు బుసలు కొడుతూ ఉంటాయి. చాడీలు, కొండీల లావా మండుతూ ఉంటుంది. అపనిందలు, అసత్య ఆరోపణలు పెంపొందుతూ ఉంటాయి. ఒకరిపై నొకరు బురదచల్లుకోవడం, ఈర్ష్యతో ఒకరినొకరు కించపరచుకోవడం జరుగుతుంది. అహం దెబ్బతిన్న వ్యక్తుల మధ్య పరస్పరం ప్రతీకార జ్వాలలు ఎగిసిపడుతూ ఉంటాయి. ఇలాంటి పరమ జుగుప్సాకరమైన చెడులు కొనసాగుతున్న చోట సహజంగానే చీలికలు ఏర్పడతాయి.

ఇలాంటి చోట్ల ఏ విషయం కూడా అసమ్మతి వర్గాలను అడ్డుకోలేదు. ఇక్కడ నిర్మాణకార్యం సంగతి అలా ఉంచి, ఇరువర్గాల మధ్య స్నేహ సంబంధాలను మెరుగుపరచే అవకాశం కూడా ఉండదు. ఇలాంటి వాతావరణంలో ఉద్రిక్తతలు, సంఘర్షణలు సహజమే. ఇవి కేవలం అహంకారులు ఆత్మ స్తుతిపరులకే పరిమితమయి ఉండవు. క్రమేణా ఎంతో సజ్జనులు, సహృదయులు కూడా వీటిలో చిక్కుకుంటారు.

సహృదయుడైన వ్యక్తి సాధారణ పరిస్థితిలో సద్విమర్శనే కాదు, దుర్విమర్శనైనా సహించగలుగుతాడు. కాని తన విషయంలో పరోక్షనిందను వింటే మాత్రం అతని హృదయం కలుషితం కాకుండా ఉండజాలదు. కనీసం పరోక్షంగా నిందించే వ్యక్తి పట్ల అతని నమ్మకమైనా సడలిపోతుంది. ఈ విధంగా ఒక సహృదయుడు, రాగద్వేషాల కారణంగా ఇతరులు తనపై ఎన్ని అభాండాలు వేసినా క్షమిస్తాడు. అపనిందలు, అపవాదాలు, అసత్యారోపణలు, దూషణ, దుష్ప్రచారం, ఇంకా అంతకంటే బాధాకరమైన విషయాల్ని కూడా అతను పట్టించుకోడు. కాని ఈ దుర్లక్షణాలున్న వ్యక్తుల్ని గురించి అనుభవపూర్వకంగా తెలిసిన తరువాత, వారి పట్ల ఏ విషయంలోనూ అతను నిశ్చింతగా ఉండలేడు. దీన్నిబట్టి సామూహిక వాతావరణంలో ఈ దోషాలు తమ వికృత రూపాలతో రచ్చకెక్కినప్పుడు సహృదయుడైన మనిషి కూడా షైతాన్ వలలో పడకుండా ఉండలేడని తెలుస్తోంది. చివరికి ఎంత గొప్ప నీతిమంతుడైనాసరే, వివాదాల విషవలయం నుండి బయటపడగలడు గాని, ఉద్రిక్త వాతావరణపు వాడి పంజా నుండి తప్పించుకోలేడు.

వీటన్నిటి దృష్ట్యా సమాజ సంస్కరణ, లక్ష్యం కోసం పోరాడదలచిన వారి

సంస్థ ఇలాంటి దుర్లక్షణాలున్న వ్యక్తులు లేకుండా ప్రక్షాళనం కావలసిన ఆవశ్యకత ఎంత ఉందో ఇక వేరే చెప్పనవసరం లేదు. నిజం చెప్పాలంటే అహంకారం ఆత్మస్తుతుల విషక్రిములు ప్లేగు, కలరా విషక్రిములకన్నా ఎంతో ప్రమాదకరమైనవి. వీటిని నిర్మూలించకుండా సత్సమాజ నిర్మాణం గురించి ఆలోచించనైనా లేము.

## పశ్చాత్తాపం

ఇస్లామీయ షరీఅత్ ఈ వ్యాధి పుట్టుక నాటి నుంచే దీనికి చికిత్స ప్రారంభిస్తుంది. ఆ తరువాత ప్రతి ఘట్టంలోనూ దాని నివారణకై సముచిత సూచనలు అందజేస్తుంది. మోమిన్ (విశ్వాసి) ఏ సమయంలోనయినా, ఏ దశలోనయినా సరే, అహంకారం, ఆత్మస్తుతిల్లాంటి చెడుగుల్లో పడిపోవచ్చు. అందువల్ల మోమిన్‌ని ఈ రుగ్మతల నుండి కాపాడటానికి ఖుర్ఆన్ హదీసులో అనేక చోట్ల పశ్చాత్తాపం, పాప మన్నింపులను గురించి ఉపదేశించడం జరిగింది.

మోమిన్ ఎప్పుడూ తానేదో గొప్పవాణ్ణని తలచకూడదు. అతను అనుక్షణం తన దోషాలు, పొరపాట్లు, బలహీనతలేమిటో గుర్తించి పాప మన్నింపునకై దైవాన్ని వేడుకోవాలి. పెద్ద పెద్ద సత్కార్యాలు చేసి కూడా ఏమాత్రం అహంభావానికి గురికాకుండా, దేవుని సన్నిధిలో తన నిస్సహాయత, దైన్యాలను వెలిబుచ్చుకుంటూ, "దేవా! నీ సేవామార్గంలో నా వల్ల ఏవైనా పొరపాట్లు జరిగితే నన్ను మన్నించు" అని వేడుకోవాలి. పశ్చాత్తాపం, పాప మన్నింపులను గురించి దివ్య ఖుర్ఆన్ చేసే ఉపదేశ రత్నాల ఉద్దేశం ఇదే.

దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) కు మించి పరిపూర్ణ మానవత్వం సంతరించుకున్న మహనీయుడెవడున్నాడు? ప్రపంచంలో ఆయన కంటే గొప్ప ఘనకార్యం సాధించిన ఘనుడెవడున్నాడు? కాని యావత్తు మానవ చరిత్రలోనే ఈ అసాధారణమైన అత్యున్నత ఘనకార్యం సాధించిన తరువాత ఆ మానవోత్తముడికి విశ్వప్రభువు దర్బారు నుంచి అందిన ఈ మహితోక్తులు చూడండి :

"దేవుని సహాయం, విజయం ప్రాప్తమయినప్పుడు ప్రజలు గుంపులు గుంపులుగా వచ్చి అల్లాహ్ ధర్మంలో ప్రవేశించడాన్ని నీవు కళ్ళారా చూసుకున్నప్పుడు, నీవు నీ

ప్రభువు (ఔన్నత్యం)ను కొనియాడుతూ ఆయన (పవిత్రనామం) ను స్మరించు, పాప మన్నింపునకై ఆయన్ని వేడుకో. పశ్చాత్తాపంతో క్షమాపణ వేడుకునే వారిని ఆయన ఎంతగానో క్షమిస్తాడు." (దివ్య ఖుర్ఆన్ – 110 : 1-3)

అంటే "దేవుని అనుగ్రహం వల్ల జయప్రదంగా నీవు సాధించిన ఈ మహాకార్యానికి గాను ప్రశంసలకు అర్హుడు, నిజానికి నీవు కాదు, నీ ప్రభువు మాత్రమేనని తెలుసుకో. నీవెంత పెద్ద పని సాధించినా దానికి సంబంధించిన సేవా హక్కు పూర్తిగా నెరవేరలేదని గ్రహించు. అందువల్ల బహుమానం అడగటానికి బదులు – దేవా! నీ సేవను పూర్తిగా నెరవేర్చడంలో ఏదైనా కొరత జరిగితే నన్ను మన్నించు" – అని ప్రార్థించాలని ఈ ఆయత్ ద్వారా విశదమవుతోంది.

మహాప్రవక్త (సఅసం) తన ఇహలోక నిష్క్రమణకు ముందు తరచుగా ఇలా ప్రవచించేవారు : "నేను దేవుని స్తుతితో పాటు ఆయన పవిత్ర నామాన్ని స్మరిస్తూ ఉంటాను. పాప మన్నింపు కోసం అల్లాహ్‌ను వేడుకుంటాను. ఆయన సన్నిధిలో పశ్చాత్తాపాన్ని వెలిబుచ్చుకుంటాను." (బుఖారీ – హజ్రత్ ఆయిషా (రజి).

"దైవసాక్షి! నేను ప్రతిరోజూ డెబ్బైసార్లకన్నా ఎక్కువే అల్లాహ్‌ను పాపమన్నింపు కోసం వేడుకుంటాను. ఆయన ముందు పశ్చాత్తాపాన్ని వెలిబుచ్చుకుంటాను." (బుఖారీ – హజ్రత్ అబూహురైరా –రజి)

ఈ హితోక్తుల సారాంశాన్ని గనక ఎవడైనా గ్రహించి పూర్తిగా తనలో ఇముడ్చుకోగలిగితే, అతని హృదయంలో దుష్టభావాల అల్లకల్లోలం అశాంతుల్ని రేకెత్తించే అహంకార దుమారం చోటుచేసుకోజాలదు.

## సత్యవచన ప్రకటన

అప్పటికీ ఈ చెడుగు హృదయంలో నాటుకుపోయే ప్రమాదం ఏర్పడితే నైతికత, ఆచరణాత్మక వైఖరుల్లో దాని పుట్టుక, పురోభివృద్ధుల్ని ఇస్లామీయ షరీఅత్ అడుగడుగునా నివారిస్తుంది. ఆ విషయంలో కఠినమైన ఆదేశాలను ఇస్తుంది. ఉదాహరణకు – మనిషి ప్రారంభంలో విమర్శలకు తాను అతీతుణ్ణనుకుంటాడు. నలుగురిలో తన అభిప్రాయాన్నే ఒప్పించడానికి ప్రయత్నిస్తాడు. తనను ఇతరులు తప్పు పట్టడాన్ని

సహించలేడు. షరీఅత్ ఈ వైఖరికి భిన్నంగా మంచిని పెంచే, చెడుని త్రుంచే పనిని విశ్వాసులందరికీ విధిగా నిర్ణయించింది. ప్రత్యేకించి అధికార మదాంధకారుల ముందు సత్యవచన ప్రకటన చేయడాన్ని అత్యుత్తమ జిహాద్ (ధర్మపోరాటం)గా పరిగణించింది. దీనివల్ల ముస్లిం సమాజంలో అహంకార విషబీజం మొలకెత్తడానికే ఆస్కారం లేకుండా, చెడును ఆక్షేపించే, మంచిని ఉపదేశించే వాతావరణం నెలకొంటుంది.

## అసూయాద్వేషాలు

అహంభావం అహంకారాలకు రెండవ రూపం అసూయాద్వేషాలు. ఈ వ్యాధి చిహ్నాలు పొడసూపిన వ్యక్తి తన అహంపై దెబ్బతీసిన ప్రతి వ్యక్తి పట్లా అసూయా ద్వేషాలు పెంచుకుంటాడు. దాంతో ఆ మనిషితో ఇతని సంబంధాలు చెడిపోవడం ప్రారంభిస్తాయి. ఈ ప్రవృత్తిని కూడా ఇస్లామీయ షరీఅత్ పాపంగా పరిగణించి, దానికి తీవ్రమైన శిక్ష ఉందని హెచ్చరిస్తుంది.

ఈ విషయాన్ని గురించి దైవప్రవక్త (సఅసం) ఎన్నో హదీసులను ప్రజలకు హితవు చేస్తూ, "జాగ్రత్త! అసూయపడకండి. నిప్పు ఎండు కట్టెల్ని కాల్చినట్లు అసూయ మనిషి సత్కర్మలను హరించివేస్తుంది" అని చెప్పారు.

వివిధ హదీసుల్లో ఆయన అనేక రకాలుగా ఈ విషయాన్ని గురించి ఇలా నొక్కి చెప్పారు :

"ఒకరిపై నొకరు ద్వేషం పెంచుకోకండి. ఒకర్ని చూసి మరొకరు ఈర్ష్యపడకండి."

"ఒకరికొకరు ఎడముఖం పెడముఖంగా ఉండకండి. మీ పరస్పర సంబంధాలు తెంచుకోకండి."

"పరస్పరం మాట్లాడుకోవడం మానేయకండి. మూడు రోజులకు మించి తన తోటి ముస్లిం సోదరునితో సంబంధం తెంచుకొని ఉండటం ముస్లింకు ధర్మసమ్మతం కాదు."

## అనుమానం పెనుభూతం

అహంభావం అహంకారాలకు మూడవ రూపం అనవసరమైన అనుమానాలకు

గురికావడం. ఇలా ఇతరుల్ని అనుమానించే వ్యక్తి ఆ తరువాత వారిలో లోపాల్ని వెతకడానికి తాపత్రయపడతాడు. తాను తప్ప ఇతరులు చెడ్డవాళ్ళే అని అతను మొదట్లో ఓ దురభిప్రాయాన్ని ఏర్పరచుకుంటాడు. ఒక వ్యక్తిలో ఏదైనా అభ్యంతరకరమైన విషయం ఉన్నట్లు పైకి అనిపించితే ఈ అనుమాన పిశాచి దాన్ని సహృదయంతో విశ్లేషించడానికి బదులు ఎల్లప్పుడూ అతనిలో చెడుని చూడటానికే ప్రయత్నిస్తుంది. కనీసం తాను చెడు అనుకుంటున్న ఆ విషయం అతనిలో నిజంగా ఉందా లేదా అని కూడా ఈ మనిషి విచారించడు. ఈ అనుమానం నుంచే ఇతరుల్లో లోపాలు వెతికే దుర్బుద్ధి పుట్టుకొస్తుంది. ఇతరుల గురించి ముందే ఒక అభిప్రాయం ఏర్పరచుకున్న వ్యక్తి దాని నిరూపణ కోసం వారి వ్యవహారాలను గురించి ఆరా తీయడం ప్రారంభిస్తాడు.

ఖుర్ఆన్ ఈ రెండు విషయాలను నేరాలుగా పరిగణిస్తుంది. హుజురాత్ సూరాలో ఒకచోట "మితిమీరిన అనుమానాలకు దూరంగా ఉండండి. వాటిలో కొన్ని అనుమానాలు పాపాలయి ఉంటాయి. ఇతరుల తప్పులు, రహస్యాలను వెలికి తీయకండి" అని దైవాజ్ఞ ఉంది.

హదీసుల్లో కూడా వీటిని గురించి హెచ్చరికలున్నాయి. "జాగ్రత్త! దురనుమానాలకు గురికాకండి. దురనుమానం అతి నీచమైన అసత్యం" అని దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు.

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ (రజి) మాట్లాడుతూ "ఇతరుల రహస్యాలను కూపీ తీయకూడదని, వారి లోపాలను వెతకకూడదని మమ్మల్ని దైవప్రవక్త (సఅసం) వారించారు. అయితే మా ముందు ఏదైనా (చెడు) విషయం బట్టబయలయితే మాత్రం మేము దాన్ని విడిచిపెట్టం" అని చెప్పారు.

హజ్రత్ ముఆవియా (రజి) ఉల్లేఖించిన ఒక హదీసులో "మీరు ముస్లిముల రహస్య విషయాలను ఆరాతీస్తూ తిరుగుతుంటే వారిని చెడగొట్టిన వారవుతారని" మహాప్రవక్త (సఅసం) హెచ్చరించారు అని ఉంది.

## పరోక్ష నింద

దీని మూలం దురుద్దేశపూరితమైన అనుమానం మీద ఆధారపడినా, లేక వాస్తవం మీద ఆధారపడినా ఉభయ స్థితుల్లోనూ ఇతరుల్ని అనుమానించడానికి, ఆ

అవమానంతో ఆనందించడానికి లేదా ఏదైనా ప్రయోజనం పొందడానికి పరోక్షంగా వారిని గురించి చెడు పలుకడమే పరోక్ష నింద. దీన్ని గురించి హదీసుల్లో ఇలా ప్రస్తావించడం జరిగింది :

"నీవు నీ సోదరుని పరోక్షంలో అతనికి నచ్చని విధంగా అతడ్ని గురించి ఇతరుల ముందు ప్రస్తావించడమే పరోక్షనింద అనబడుతుంది" అని దైవప్రవక్త (సఅసం) అన్నారు.

అప్పుడాయన సహచరులు కొందరు, "ఒకవేళ మేము చెప్పే విషయం మా సోదరునిలో నిజంగా ఉన్నప్పటికీ అది పరోక్షనిందే అవుతుందా?" అని అడిగారు.

దానికి దైవప్రవక్త (సఅసం) "నీవు ప్రస్తావించే చెడు విషయం అతనిలో నిజంగా ఉంటే అది పరోక్ష నింద అవుతుంది. ఒకవేళ అతనిలో ఆ చెడు అసలు లేకపోయినా ఉన్నట్లు చెబితే, నీవు పరోక్ష నిందను మించి అతనిపై అపనింద మోపిన వాడవవుతావు" అని అన్నారు.

ఖుర్ఆన్ ఈ చర్యను నిషేధించింది. హుజురాత్ సూరాలో ఇలా ఉంది : "మీలో ఏ ఒక్కరూ ఇతరుల్ని గురించి పరోక్ష నిందకు పాల్పడకండి. మీలో ఎవరైనా మీ మృత సోదరుని మాంసం తినటానికి ఇష్టపడతారా? దాన్ని మీరు తప్పకుండా అసహ్యించుకుంటారు."

మహాప్రవక్త (సఅసం) ఒక హదీసులో ప్రతి ముస్లిం ధనమానప్రాణాలు ఇతర ముస్లింలకు నిషేధించబడ్డాయని తెలియజేశారు. చెడును ప్రస్తావించడం అనివార్యమయిన పరిస్థితుల్లో మటుకు ఈ నిషేధం నుంచి మినహాయింపులు ఇవ్వబడ్డాయి. అయితే ఆ ప్రస్తావన వెనుక ఎలాంటి దురుద్దేశం ఉండకూడదు. ఉదాహరణకు పీడితుడు తనపై అత్యాచారి చేసిన దౌర్జన్యాన్ని గురించి ఇతరుల ముందు ప్రస్తావించవచ్చు. దానివల్ల వారు అతనికేదయినా సహాయపడ్తారన్నదే అతని ఉద్దేశం.

ఇలా చేయడానికి ఖుర్ఆన్ అనుమతించింది. "ఎవరి మీదయినా దౌర్జన్యం జరిగితే తప్ప చెడును గురించి నోరు విప్పడం దైవానికి ఇష్టం లేదు."

ఉదాహరణకు ఒక వ్యక్తి తన కూతుర్ని మరొకనికిచ్చి పెళ్ళి చేయదలచినప్పుడు, లేదా అతనితో కలసి ఏదైనా వ్యాపారం చేయడానికి నిర్ణయించుకున్నప్పుడు, వారిద్దరిలో ఎవరైనా ఈ వ్యవహారం గురించి తెలిసిన వ్యక్తిని సలహా కోరితే, ఆ వ్యక్తికి నిజంగా రెండవ పక్షం మనిషిలో ఏదైనా చెడు ఉన్నట్లు తెలిస్తే అతను శ్రేయోభిలాషతో దాన్ని బహిర్గతం చేయడం ధర్మసమ్మతమే కాదు, చాలా అవసరం కూడా.

స్వయంగా దైవప్రవక్త (సఅసం) కూడా ఇలాంటి సందర్భాల్లో చెడు విషయాన్ని బయటపెట్టేవారు. ఒక హదీసు ప్రకారం ఇద్దరు వ్యక్తులు ఫాతిమా బిన్త్ ఖైస్ అనే స్త్రీని వివాహమాడాలని ఆమె దగ్గరికి ఒక మనిషిని పంపుతారు. అప్పుడామె దైవప్రవక్త (సఅసం)ను సలహా కోరుతారు. దైవప్రవక్త (సఅసం) ఆమెకు వాస్తవం తెలియజేస్తూ "వారిద్దరిలో ఒకతను నిష్ట దరిద్రుడు. మరొకతనికి తరచుగా భార్యలను కొట్టే అలవాటుంది" అని హెచ్చరించారు.

అలాగే హదీసు ఉల్లేఖనాల విషయంలో షరీఅత్‌ను సురక్షితంగా ఉంచడానికి, అంతగా నమ్మదగని ఉల్లేఖకుల బలహీనతలను ప్రస్తావించడం ధర్మసమ్మతమేనని షరీఅత్ వేత్తలందరూ ఏకాభిప్రాయం వెలిబుచ్చారు. ధర్మం కోసం ఇది చాలా అవసరమయినందున హదీసువేత్తలు ఆచరణాత్మకంగా ఈ విషయంలో అపార సేవ చేశారు. ప్రజలపై బహిరంగంగా దౌర్జన్యం చేసే, అశ్లీలాన్ని వ్యాపింపజేసే, వ్యభిచరించే వ్యక్తుల విషయంలో కూడా పరోక్షనింద ధర్మసమ్మతమే. దైవప్రవక్త (సఅసం) ఆచరణ ద్వారా కూడా దీనికి అనుమతి ఉన్నట్లు తెలుస్తోంది.

ఇలా మినహాయింపులకు సంబంధించిన ఈ సందర్భాలు తప్ప మిగిలిన పరిస్థితుల్లో పరోక్షనింద నిషేధించబడింది. దాన్ని వినడం కూడా పాపమే. వినేవాడు పరోక్ష నిందకు పాల్పడేవాడ్ని వారించాలి, లేదా పరోక్షనిందకు గురవుతున్న వ్యక్తిని సమర్థించాలి, లేదా కనీసం ఆ చోటు నుంచి లేచి అయినా వెళ్ళిపోవాలి.

## చాడీలు

పరోక్షనింద వల్ల ప్రజ్వరిల్లిన అగ్ని జ్వాలల్ని చాడీలు మరింత రెచ్చగొడ్తాయి. ఇందులో కూడా అహంభావ మనస్తత్వమే మౌలిక పాత్ర వహిస్తుంది. చాడీలగొట్టు

ఎవరి శ్రేయస్సును కూడా కోరడు. అటు చాడీలకు గురయిన వ్యక్తికి, ఇటు చాడీలు విన్న వ్యక్తికి కూడా ఇతను శ్రేయోభిలాషి కాలేడు. ఇతను వారిద్దరితోనూ స్నేహం చేస్తాడు. కాని వాస్తవానికి వారిద్దరికీ అపకారం తలపెట్టేవాడుగా తయారవుతాడు. అందువల్లనే ఇతను ప్రతి ఒక్కరి మాటలను ఖండించకుండా ఎంతో జాగ్రత్తగా వింటాడు. ఆ తరువాత ఈ మాటలు మోసుకెళ్ళి రెండవ స్నేహితుని చెవిలో ఊదేస్తాడు. ఆ విధంగా ఒకచోట ప్రజ్వరిల్లిన ద్వేషాగ్ని మరో చోటికి కూడా పాకిపోవడానికి దోహదం చేస్తాడు. కల్లోలం సృష్టించడంలో ఈ చాడీ పరోక్ష నిందకన్నా అతి ప్రమాదకరమైన దుర్లక్షణం. అందువల్ల దేవుని షరీఅత్ దీన్ని కూడా నిషేధించింది.

దివ్య ఖుర్ఆన్ అత్యంత నీచమైన లక్షణాలుగా పరిగణించిన వాటిలో చాడీలు చెబుతూ తిరగడం కూడా ఉంది. చాడీలు చెప్పేవానికి స్వర్గప్రవేశం లభించదని దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు. మరొక హదీసులో "మీరు రెండు రూపాలున్న (ద్వంద్వ స్వభావంగల) పరమ దుర్మార్గుణ్ణి చూస్తారు. అతను కొందరి దగ్గరికి ఒక రూపంతో, మరికొందరి దగ్గరికి వేరొక రూపంతో వస్తాడు" అని తెలిపారు ఆయన.

ఇలాంటి వ్యక్తుల పట్ల మనం చాలా అప్రమత్తంగా ఉండాలి. ఎవరైనా పరోక్షనిందకు పాల్పడటం చూస్తే వెంటనే అక్కడికక్కడ దాన్ని ఖండించాలి. లేదా ఇరుపక్షాల వారి ముందు ఈ వ్యవహారాన్ని లేవదీసి పరిస్థితిని చక్కదిద్దాలి. అయితే ఇలాంటి సందర్భంలో మధ్యవర్తి చాలా మెళకువతో వ్యవహరించాలి. వారిద్దరిలో ఒకరు మరొకర్ని పరోక్షంగా నిందించాడన్న భావం అతని మాటల్లో ఏమాత్రం స్ఫురించకూడదు. ఒకవేళ పరోక్షనిందకు గురయిన వ్యక్తిలో నిజంగానే ఆ చెడు విషయం ఉంటే, దాన్ని దూరం చేసుకోవలసిందిగా మధ్యవర్తి అతనికి నచ్చజెప్పాలి. మరోవైపు పరోక్షనిందకు పాల్పడిన వ్యక్తికి కూడా నువ్వు చేసింది మంచి పని కాదని, ఈ పద్ధతిని మానుకోవాలని నచ్చజెప్పాలి.

## గుసగుసలు

ఈ విషయంలో రగడను పరాకాష్ఠకు చేర్చే దుర్లక్షణం గుసగుసలు. ఈ గుసగుసలు, రహస్యమంతనాలే చివరికి కుతంత్రాలకు, కుయుక్తులకు దారితీస్తాయి. ఒకరినొకరు ఘర్షించుకునే పరిస్థితులు ఏర్పడతాయి. అందువల్ల ఇస్లామీయ షరీఅత్

గుసగుసల ధోరణిని కూడా నిషేధించింది. ఖుర్‌ఆన్‌లో దీన్ని షైతాన్ చర్యగా పరిగణించడం జరిగింది. దైవభీతి పరిధిలో ఉంటూ ఏదైనా మంచి పని కోసం ఇద్దరు ముగ్గురు ఒకచోట కూడి రహస్య మంతనాలు జరిపితే మాత్రం అది ఖుర్‌ఆన్ నిషేధించిన 'గుసగుసల' క్రిందికి రాదు. అలాకాకుండా ఏదైనా దుష్టపన్నాగం పన్నడానికో, లేదా ఎవరైనా ఒక సభ్యుడికి లేక ఏదైనా ఒక వర్గానికి అపకారం తలపెట్టడానికో, లేదా దైవప్రవక్త (సఅసం) ఆజ్ఞలను ఉల్లంఘించే ఉద్దేశంతోనో, సంస్థ కళ్లుగప్పి రహస్య మంతనాలు జరిపితే అది పూర్తిగా నిషిద్ధ చర్య అవుతుంది.

నిజాయితీతో, సత్సంకల్పంతో, చిత్తశుద్ధితో కూడిన విభేదాలు మనిషిని ఇలాంటి చెడు వైపునకు ప్రేరేపించవు. ఇలాంటి వ్యక్తులు ఏదైనా చెప్పదలచుకుంటే బహిరంగంగా తమ అభిప్రాయాల్ని వ్యక్తపరుస్తారు. వాటిని సంస్థ దృష్టికి తెచ్చి నలుగురి ముందు బహిరంగంగానే ప్రస్తావిస్తారు. వారు తమ అభిప్రాయాలను సహేతుకంగా నిరూపించడానికి ప్రయత్నిస్తారు. ఒకవేళ ఇతరుల అభిప్రాయానికే బలమైన ఆధారాలు ఉంటే దాన్ని సంతోషంగా అంగీకరిస్తారు. చర్చలో సంస్థ తీసుకున్న సమిష్టి నిర్ణయం పట్ల ఇంకా ఏదైనా భేదాభిప్రాయం మిగిలి ఉంటే దాన్ని తమ వరకే పరిమితం చేసుకుంటారు. అంతేగాని దాన్ని ఆధారంగా చేసుకుని సంస్థలో రగడ సృష్టించరు.

మనుషుల్లో స్వార్థం, అహంకారం పూర్తిగా కాకపోయినా, కొంచెమయినా సరే ఉన్నప్పుడే సంస్థ బయట రహస్య మంతనాలు జరిపే అవసరం వస్తుంది. ఇలాంటి రహస్య మంతనాలు, సమాలోచనలు ఎన్నటికీ సత్ఫలితాన్ని ఇవ్వవు. ఈ ధోరణి ప్రారంభంలో ఎంత చిన్న విషయమైనా, దానివల్ల క్రమేణా మొత్తం సంస్థలో లేనిపోని అనుమానాలు, విభేదాలు చెలరేగి ముఠాతత్వ జాడ్యం ప్రబలుతుంది.

కొందరు వ్యక్తులు పరస్పరం కూడబలుక్కొని ఒక ముఠాగా ఏర్పడితే ఈ ముఠాతత్వం అంతటితో ఆగిపోదు. ఈ రోగం ఇతరులక్కూడా సోకి మరికొన్ని ముఠాలు ఉనికిలోకి వస్తాయి. ఈ ముఠాతత్వం చివరికి ఎంతమంచి సంస్థలోనయినా సరే అనేక చీలికలు తెచ్చి పరస్పరం బలప్రదర్శనలకు, ముష్టిఘాతాలకు దారితీస్తుంది. ఇలా ఈ సామూహిక వ్యవస్థ ముక్క చెక్కలయి తుదిశ్వాస కూడా విడుస్తుంది.

మహాప్రవక్త (సఅసం) ముస్లింల సామూహిక వ్యవస్థలో సంభవించే ఇలాంటి ప్రమాదాన్ని గురించి హెచ్చరిస్తూ ఇలా అన్నారు : "అరేబియాలో నమాజ్ చేయడం

ప్రారంభించిన వారు ఇక తనను ఆరాధించటంపై షైతాన్ పూర్తిగా ఆశ వదులుకున్నాడు. ఇప్పుడు వాడు ఒకే ఒక విషయం మీద ఆశ పెట్టుకున్నాడు. వారిలో అనైక్యత, అంతర్విభేదాలు సృష్టించి పరస్పరం పోట్లాడుకునేలా చేయాలన్నదే ఆ విషయం."

దైవప్రవక్త (సఅసం) ఇంతకంటే కూడా తీవ్రమైన విషయం చెప్పారు. "నేను వెళ్ళిపోయిన తరువాత మీరు పరస్పరం మెడలు నరుక్కుంటూ అవిశ్వాసులుగా మారకండి" అన్నారు ఆయన.

ఇలాంటి పరిస్థితులు ఏర్పడినప్పుడు విశ్వాసులు అవలంబించవలసిన వైఖరి ఏమిటో కూడా దైవప్రవక్త (సఅసం) తెలిపారు. మనిషి మొట్టమొదట ఇలాంటి జగడాల్లోకి దిగనే దిగకూడదని ఆయన నొక్కి చెప్పారు. "కల్లోలం నుంచి తప్పించుకున్నవాడు అదృష్టవంతుడు. కల్లోలానికి ఎంత దూరంగా ఉంటే అంత మంచిది." – "ఇలాంటి పరిస్థితిలో పడుకున్నవాడు మేల్కొన్నవాడికంటే మంచివాడు, మేల్కొన్నవాడు నిల్చున్నవాడి కంటే మిన్న. నిల్చున్నవాడు పరుగెత్తేవాడి కంటే మెరుగు." రెండో విషయం – అతను ఈ రగడలో పాల్గొనదలిస్తే, ఒక పక్షంగా కాకుండా పరిస్థితిని చక్కదిద్దే సదుద్దేశంతో పాల్గొనాలి. దీన్ని గురించి హుజురాత్ సూరాలోని మొదటి రుకూలో స్పష్టమైన ఆదేశాలు ఉన్నాయి.

స్వార్థం, అహంకారాలకు సంబంధించిన ఈ వాస్తవికతను, దాని పుట్టుక పురోభివృద్ధుల వివిధ దశలను, దాని నిర్మూలనకై షరీఅత్ సూచించిన ఆదేశాలను గురించి పూర్తిగా అర్థం చేసుకోవడం సంస్కరణకు సమాయత్తమయ్యే వారందరికీ ఎంతో అవసరం. వారిలో ప్రతి ఒక్కరూ ఆత్మ స్తుతి జాడ్యానికి దూరంగా ఉండేందుకు, ఈ జాడ్యానికి గురవటం వల్ల కలిగే ఆధ్యాత్మిక, నైతిక నష్టాలను గురించి తెలుసుకోవడానికి శక్తి వంచన లేకుండా కృషి చేయాలి. సంస్థ కూడా స్వార్థం, అహంకారాల విష క్రిములు తన సభ్యులకు సోకే అవకాశమివ్వకుండా అనుక్షణం అప్రమత్తంగా ఉండాలి. విమర్శలు సహించలేని వారిని, చేసిన తప్పును అంగీకరించలేని వారిని సంస్థ ఎన్నడూ ప్రోత్సహించకూడదు. సంస్థలో అసూయ, ద్వేషం, పగ, ప్రతీకారాల దుర్వాసనలకు ఎట్టి పరిస్థితిలోనూ తావు లేకుండా చేయాలి.

అంతేకాదు, ఇతరుల్ని అనవసరంగా అనుమానించే వారిని, ఇతరుల

వ్యవహారాలను గురించి కూపీ తీస్తూ వారి తప్పులను వెతకడానికి ప్రయత్నించే వారిని కూడా సంస్థ ఓ కంట కనిపెడుతూ ఉండాలి. పరోక్షనిందకు, చాడీలకు పాల్పడే చీడపురుగుల్ని కూడా నిర్మూలించాలి. ముఖ్యంగా గుసగుసలు రహస్య మంతనాలు జరిపే ధోరణి పట్ల సంస్థ ఎల్లప్పుడూ అప్రమత్తంగా ఉండాలి. ఎందుకంటే ఈ ధోరణే సంస్థలో చీలికలకు మూలకారణమవుతుంది. ఎవరైనా ఏదైనా వివాదాస్పదమైన సమస్య విషయంలో రహస్య మంతనాలు జరపదలిస్తే సంస్థ శ్రేయోభిలాషులెవరూ దానికి సిద్ధం కాకూడదు. ఈ చెడుకు సంబంధించిన ప్రారంభ సూచనలు ఏవైనా కనిపిస్తే సంస్థ వెంటనే సంబంధిత వ్యక్తుల్ని సంస్కరించడానికి కృషి చేయాలి. అది సాధ్యం కాకపోతే వారిని సంస్థ నుండి తొలగించడానికి పూనుకోవాలి.

ఈ దుర్లక్షణాన్ని నివారించడానికి ఎన్ని విధాలుగా ప్రయత్నించినా ఒక్కొక్కసారి ఎలాంటి ప్రయోజనం ఉండకపోవచ్చు. ఏదో విధంగా ముఠాతత్వ ఉపద్రవం వచ్చిపడుతుంది. అలాంటి పరిస్థితిలో సంస్థలో ఉండే సహృదయులైన కార్యకర్తలు కూడా ఈ జాడ్యానికి గురయి ఏదో ముఠా ఏర్పాటుకై ప్రయత్నించకూడదు. దీనికి భిన్నంగా వారు ఈ రగడకు దూరంగా ఉండి, దాన్ని నివారించడానికి వ్యక్తిగత ప్రయత్నాలు ప్రారంభించాలి. ఆ ప్రయత్నాలేవీ ఫలించకపోతే దాన్ని సంస్థ దృష్టికి తీసుకెళ్ళాలి. సహృదయులైన కార్యకర్తలు అధిక సంఖ్యలో ఉన్న సంస్థ మాత్రమే ఇలాంటి ప్రమాదాలను గురించి ముందే పసిగట్టి వాటిని ప్రారంభదశలోనే నివారించగలుగుతుంది. ఒకవేళ దుర్బుద్ధి గల కార్యకర్తలే అధిక సంఖ్యలో ఉంటే మొత్తం సంస్థ ఈ జాడ్యానికి అంటే ముఠాతత్వానికి గురయిపోతుంది.

## 2. చిత్తచాపల్యం, సమతూలనా రాహిత్యం

మానవ బలహీనతల్లో స్వార్థం, అహంకారం తరువాత రెండవ శ్రేణికి చెందిన బలహీనత ఏదైనా ఉందంటే అది చిత్తచాపల్యమని చెప్పవచ్చు. ఇది ఒక విధమైన అమాయకత్వానికి సంబంధించిన బలహీనత. ఎందుకంటే, ఇందులో దురుద్దేశం, దుష్టవాంఛ, దుష్టస్వభావాల ప్రమేయం ఉండదు. అయితే కీడు జరిగే విషయానికొస్తే స్వార్థం, అహంకారాల తరువాత రెండవ స్థానం చిత్తచాపల్యానిదే అవుతుంది.

ఒక్కొక్కసారి దీని ప్రభావం స్వార్థం, అహంకారాల ప్రభావం కన్నా ఏ మాత్రం తక్కువ స్థాయిలో ఉండదు.

చిత్తచాపల్యం వల్ల మనిషి తన భావాల్లో, ఆలోచనల్లో, ఆచరణలో, ప్రయత్నాల్లో సహజంగానే సంతులనం కోల్పోతాడు. ఈ సమతులన రాహిత్యం జీవిత సత్యాలతో ప్రత్యక్ష ఘర్షణకు దారితీస్తుంది. ఎన్నో వైరుధ్యాల సంగమం, మరెన్నో విభిన్న విషయాల సమ్మేళనాల సముదాయపు ఆచరణ ఫలితమే, మానవజీవితం. మానవుడు జీవించే ఈ ప్రపంచ పరిస్థితి కూడా అంతే. ప్రతి మానవుడూ వేర్వేరుగా ఇలాగే సృజించబడ్డాడు. మానవుల కలయికతో ఏర్పడే సామూహిక తత్వం స్థితి కూడా ఇలాగే ఉంటుంది. ప్రకృతిలో గోచరించే సమతులనం వంటి సమతులనమే ఇంచుమించు మానవుని భావాల్లో, ఆలోచనల్లో, ఆచరణలో, ప్రయత్నాల్లో కూడా ఉండాలి. అంటే మానవ స్వభావం కూడా దాదాపు ప్రకృతి స్వభావానికి అనుగుణమైనదిగా ఉండాలి.

పరిస్థితుల దిశలన్నింటినీ పరిశీలిస్తే, వ్యవహారాల కోణాలన్నింటిని గమనిస్తే, అవసరాల ప్రతి రంగానికి దాని న్యాయమైన హక్కునిస్తే, ప్రకృతికి సంబంధించిన ప్రతి విషయానికి తత్సంబంధిత ఆచరణ లభిస్తే ప్రది చోటా మనకు సమతులనమే గోచరిస్తుంది. ఈ సమతులనం ఎంత ప్రామాణికమైనదిగా ఉంటుందో అంతే ప్రయోజనకరంగా ఉంటుంది. సమతులనం ఎంత లోపభూయిష్టంగా ఉంటుందో అంతే స్థాయిలో అది జీవిత సత్యాలతో ఘర్షిస్తూ నష్టాలకు కారణభూతమవుతుంది.

ప్రపంచంలో ఇప్పటి వరకు సంభవించిన అరాచకం అల్లకల్లోలాలకు, ప్రస్తుతం ఉన్న అల్లకల్లోలాలకు మూలకారణం సమతులనం లేని మస్తిష్కాలు చేసిన పనులే. అవి మానవ సమస్యల్ని ఏకకోణం నుంచి చూసి అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాయి. వాటి పరిష్కారం కొరకు సమతులనం లేని పథకాలు రూపొందించాయి. వాటిని అమలుపరచేందుకు, సమతూకం లేని విధానాలు అవలంబించాయి. మానవ సమాజ విచ్ఛిన్నానికి అసలు కారణం ఈ ధోరణే. సమాజ నిర్మాణానికి సంబంధించిన ఏదైనా పని నెరవేరగలుగుతుందంటే అది భావాల సమతులనం, ఆచరణ విధానాల సమతూకం వల్ల నెరవేరుతుంది.

ఈ లక్షణం ముఖ్యంగా సంస్కరణ, నిర్మాణాలకై ఇస్లాం సూచించిన పథకాన్ని అమలు పరచడానికయితే మరింత అవసరమవుతుంది. కారణం ఇస్లాం సూచించిన ఈ పథకంలో అత్యున్నతమైన, ప్రామాణికమైన సమతులనం ఉండటమే. అందువల్ల దీన్ని పుస్తకాల పుటల నుంచి వాస్తవ జగత్తులోకి తరలించేందుకు ప్రత్యేకంగా సమతులనా స్వభావులయిన కార్యకర్తలు, కార్యశీలురే అర్హులవుతారు. అంటే ఇస్లామీయ విధానంలో ఉండేటటువంటి సమతులనమే వారి భావాల్లో ఉండాలి. ఇస్లామీయ సంస్కరణ స్వభావంలో ఉండేటటువంటి సమతూకమే వారి స్వభావాల్లోనూ ఉండాలి. స్వభావంలో సమతులనం లోపించిన అతివాదులు పనిని చెడగొడ్తారే తప్ప పూర్తి చేయలేరు.

ఫలితాల దృష్ట్యా సమతులనా రాహిత్యం వల్ల జరిగే ఒక నష్టం - అది సాధారణంగా వైఫల్యానికి కారణభూతం కూడా అవుతుంది. ప్రజాజీవన వ్యవస్థలో సంస్కరణ, మార్పులకు సంబంధించిన ఏ పథకాన్ని చేపట్టినా, అది జయప్రదం కావాలంటే మనం చేపట్టిన పథకం సమంజసమైనది, సహేతుకమైనదని తలచి తృప్తి చెందినంత మాత్రాన సరిపోదు. దాంతోపాటు మనం ఈ పథకం సరయినది, ప్రయోజనకరమైనది, ఆచరణ యోగ్యమైనదని సామాన్య ప్రజానీకం చేత కూడా ఒప్పించగలగాలి. తరువాత ఈ పని ప్రజల్ని ఆకట్టుకునేలా, దానిపై వారు ఆశలు పెట్టుకునేలా దానికి తగిన రూపకల్పన చేసి తగువిధంగా నిర్వహించాలి. ఇది సాధించే భాగ్యం భావాల్లో కార్యాచరణలో సమతులనం పాటించే వారికే ప్రాప్తమవుతుంది.

సమతూకం లోపించిన ఏదైనా పథకాన్ని అతివాద విధానాలతో నిర్వహిస్తే అది ప్రజలను ఆకట్టుకొని వారిలో ఆశలు కలిగించడానికి బదులు, వారిలో ద్వేషం, నిరాశలే కలిగిస్తుంది. పైగా అది ప్రజల్ని తనకు అనుకూలంగా మలచుకొని వారిని సంతృప్తపరచడానికి బదులు, వారి అభ్యంతరాలకు, అసంతృప్తికీ గురవుతుంది. అదీగాక దాని ఈ లక్షణం స్వయంగా దాని ప్రచార సామర్థ్యాన్ని ప్రభావశక్తిని సయితం నిర్వీర్యం చేసేస్తుంది. ఈ పనిని నిర్వహించడానికి కొందరు అతివాదులు సమాయత్తమయినప్పటికీ వారు మొత్తం సమాజాన్ని అతివాదులుగా మార్చివేయడం యావత్ ప్రపంచాన్ని, వాస్తవాల నుండి దృష్టి మళ్ళించడం అంత తేలికయిన విషయం కాదు.

అదేవిధంగా సమాజ సంస్కరణ, పునర్నిర్మాణాల పథకాన్ని చేపట్టిన సంస్థ విషయంలో కూడా ఈ అతివాద ధోరణి వినాశకారిగానే పరిణమిస్తుంది.

## ఏకోన్ముఖ వైఖరి

సమతులనం లేని మానవ మస్తిష్కం ఎల్లప్పుడూ ఒకే దృక్కోణంతో విషయాన్ని పరికిస్తుంది. ఇలాంటి వ్యక్తి రెండో కోణం నుండి చూడటానికే ప్రయత్నించడు. ఏదైనా తన దృష్టిని మళ్ళించడం. అటువైపే పురోగమిస్తాడు. దీనివల్ల ఆ వ్యవహారాన్ని అర్థం చేసుకోవడంలో అతని మేధ ఒక విధమైన సమతులనా రాహిత్యానికి గురవుతుంది. నిర్ణయాలు తీసుకోవడంలో కూడా అతను నిత్యం ఒక వైపునకే మొగ్గు చూపుతుంటాడు. తాను ముఖ్యమైనదని భావించిన విషయాన్నే పట్టుకుని వ్రేళ్ళాడుతాడు. అలాంటిదే మరో ముఖ్యమైన విషయానికి లేదా అంతకంటే మరో ముఖ్యమైన విషయానికి అతను ఎలాంటి ప్రాముఖ్యం ఇవ్వడు. మరో చెడు విషయాన్ని లేదా అంతకంటే తీవ్రమైన చెడు విషయాన్ని గురించి అతను పట్టించుకోడు. తాను పట్టిన కుందేటికి మూడే కాళ్ళన్నట్లు మొండివైఖరి అవలంబిస్తాడు.

ఇక నియమాలకు కట్టుబడే విషయంలో అయితే అతను పరిస్థితి, నిరాసక్తత, నిర్లిప్తతల దాకా పోయేటంతగా తీవ్రమైన నియమనిష్ఠలు పాటిస్తాడు. కార్యనిర్వహణలో ఆచరణాత్మక అంశాలను ఖాతరు చేయడు. ఆచరణ విషయానికొస్తే అందులో కూడా అతివాదానికి పోయి నియమనిబంధనల్ని సయితం ఉల్లంఘించే పరిస్థితికి చేరుకుంటాడు. పనిని సుందరంగా తీర్చిదిద్దుతూ, సమర్థవంతంగా నిర్వహించాలన్న ధ్యాసే ఉండదు అతనికి. ఎలాగైనా సరే పని కావాలి అన్నదే అతని లక్ష్యం. ఆ లక్ష్యం కోసమే అతను అన్ని రకాల ఒనరుల్ని వినియోగిస్తాడు.

## అతివాదం

ఈ ధోరణి అంతటితో ఆగిపోదు. అది మరి కాస్త ముందుకు పోయి అతివాదంగా మారిపోతుంది. దాంతో మనిషి తన వాదనే లేక తన అభిప్రాయమే సరయిందని మొండిగా వ్యవహరిస్తాడు. అభిప్రాయ విభేదంలో అతివాదానికి దిగుతాడు, కఠినవైఖరి అవలంబిస్తాడు. ఇతరుల దృక్పథాన్ని న్యాయదృష్టితో చూడడు. దాన్ని

సహృదయంతో అర్థం చేసుకోవడానికి ప్రయత్నించడు. పైపెచ్చు ప్రత్యర్థి అభిప్రాయానికి పెడర్థాలు తీస్తూ దాన్ని త్రోసిపుచ్చడానికి, అవహేళన చేయడానికే ప్రయత్నిస్తాడు. ఈ ధోరణి అతని విషయంలో ఇతరులకు, ఇతరుల విషయంలో అతనికి రోజు రోజుకు సహించరానిదిగా మారిపోతూ ఉంటుంది.

అతని సమతులనా రాహిత్యం కనీసం ఇక్కడికి వచ్చయినా ఆగిపోతే పరవాలేదు. కాని అతను మంచిదని భావించిన దాన్ని పెంచిపోషిస్తూ పోతే ఆ తరువాత చిరచిరలాడటం, చిర్రెత్తిపోవడం, దురుసుగా మాట్లాడటం, ఎదుటివారిని అనుమానించడం, వారి సంకల్పాలపై దాడి చేయడం వరకూ అతని పరిస్థితి చేరుకుంటుంది. ఇలాంటి స్వభావం గల వ్యక్తులు సామూహిక వ్యవస్థలో ఎంతో కాలం ఇమడలేదు.

## సామూహిక సమతులనా రాహిత్యం

ఇలాంటి వైఖరిని ఒక సభ్యుడు అవలంబిస్తే మహా అయితే అతనొక్కడే సంస్థ నుండి వేరయి, దాని సేవా భాగ్యానికి దూరమయిపోతాడు. అంతే తప్ప అతని వల్ల సామూహిక నష్టం ఏదీ సంభవించదు. అయితే ఆలోచనా తీరులో సమతులనం లేని ఇలాంటి చపలచిత్తులు అనేకమందితో కూడిన ఏదైనా సంస్థ ఆవిర్భవిస్తే, ఆ సంస్థ అచిరకాలంలోనే విభిన్న మనస్తత్వాలు గల అనేక ముఠాలకు నిలయమయిపోతుంది. ప్రతి ముఠా తన ప్రయోజనాల కోసమే పనిచేస్తూ సంస్థ అసలు లక్ష్యాన్ని విస్మరిస్తుంది. సంస్థలో ఒక అతివాదానికి జవాబుగా మరో అతివాదం పుట్టుకొస్తుంది. విభేదాలు నానాటికీ తీవ్రమయిపోతుంటాయి. చివరికి వాదోపవాదాలు వేడిపుంజుకొని ఘర్షణలతో, ముష్టిఘాతాలతో సంస్థ ముక్కలు చెక్కలయిపోతుంది. ఎంతో మంచి ఆశయంతో, ఆకాంక్షలతో సంఘటితమయిన ఈ పెద్ద మనుషులు ఇలా తమ స్వహస్తాలతోనే తమ సంస్థను కుక్కలు చింపిన విస్తరిలా మార్చివేస్తారు.

వ్యక్తిగత కృషితో చేసే పని వ్యక్తిగత కృషి ద్వారానే సాధ్యమవుతుంది. సామూహిక కృషితో చేయవలసిన పని సామూహిక కృషి ద్వారానే సాధ్యమవుతుంది. మొత్తం మీద సామూహిక కార్యాన్ని అనేకమంది వ్యక్తులు కలసిమెలసి చేయవలసి ఉంటుంది. వారిలో ప్రతి ఒక్కరూ తన అభిప్రాయాన్ని ఇతరులకు నచ్చజెప్పడంతో పాటు ఇతరుల

అభిప్రాయాన్ని తాను అర్థం చేసుకోవలసి ఉంటుంది. స్వభావాల విభేదాలు, సామర్థ్యాల వ్యత్యాసాలు, వ్యక్తిగత ప్రత్యేకతల తేడాలు ఉండటం సహజం. అయినప్పటికీ అందరూ పరస్పర సానుకూల వాతావరణాన్ని నెలకొల్పవలసి ఉంటుంది. అలాంటి వాతావరణం నెలకొననిదే అందరిమధ్య పరస్పరం సహకారం సాధ్యం కాదు.

ఈ వైఖరి కోసం వినయం, అణకువలు ఎంతో అవసరం. భావాల్లో ఆలోచనల్లో స్వభావంలో, నైజాల్లో సమతులనం కలిగిన వారిలోనే ఈ వినయం, అణకువలు ఉంటాయి. సమతులనం లేని చపలచిత్తులు ఏదైనా పని కోసం ఏకమయినప్పటికీ అలా వారెంతో కాలం కలసి ఉండలేరు. వారు ఏర్పరచుకునే సంఘం చీలికలు, పేలికలయిపోతుంది. ఈ చిత్తచాపల్యం మూలంగానే ప్రతి చీలికలోనూ మళ్ళీ విభేదాలు తలెత్తి చివరికి ఒక్కో నాయకుడు తన వెంట అనుయాయులు లేకుండానే ఏకాకిగా మిగిలిపోతాడు.

ధర్మసంస్థాపనను తమ జీవిత లక్ష్యంగా నిర్ణయించుకున్న వారిలో వారిని ఏకం చేయగల ఇస్లామీయ సిద్ధాంతాలపై సమాజ సంస్కరణ పని చేయడానికి అమితమైన శ్రద్ధాసక్తులు, ఉత్సాహం, ఉద్వేగాలు ఎంతో అవసరం. అంతేకాకుండా వారు తరచుగా తమ బలహీనతలను గురించి ఆత్మావలోకనం చేసుకుంటూ ఉండాలి. ముఖ్యంగా తమ భావాలోచనల్లో స్వభావనైజాల్లో ఏదైనా సమతులనా రాహిత్యం ఉంటే దాన్ని దూరం చేసుకోవడానికి ప్రయత్నించాలి. సంస్థ కూడా రుగ్మత ఏ స్థాయిలోనూ పొడసూపకుండా జాగ్రత్త వహిస్తూ ఉండాలి. ఈ విషయంలో తీవ్ర వైఖరిని అతివాదాలను ఖండించే ఖుర్ఆన్ సూక్తుల్ని, ప్రవక్త ప్రవచనాల్ని దృష్టిలో పెట్టుకోవాలి. దివ్య ఖుర్ఆన్ గ్రంథ ప్రజల (అంటే యూదుల, క్రైస్తవుల) మౌలిక దోషాలను ధర్మంలో అతివాదంగా పేర్కొంటూ ఇలా తాకీదు చేసింది : "ఓ గ్రంథ వహులారా! మీరు ధర్మంలో అతిశయిల్లకండి." వాటికి ముస్లింలు దూరంగా ఉండాలని దైవప్రవక్త (సఅసం) ఇలా హెచ్చరిక చేశారు.

"జాగ్రత్త! అతివాదంలో పడకండి. మీకు పూర్వం గతించిన ప్రజలు ధర్మానుసరణ విషయంలో ఈ అతివాద ధోరణికి గురయ్యే నాశనమయ్యారు."

హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం ప్రకారం మహాప్రవక్త (సఅసం) ఒకసారి

ఉపన్యాసమిస్తూ "కాఠిన్యాన్ని అవలంబించేవారు, అతిశయం, అతివాదాలకు పోయేవారు నాశనమయ్యారు" అని మూడుసార్లు అన్నారు. ప్రవక్త సందేశంలోని విశిష్ట గుణం ఏమిటంటే, ఆయన (స) వెనుకటి సమాజాలలోని రెండు అతివాదాలకు నడుమ సవ్యమైన సమతూకంతో కూడిన విధానాన్ని తీసుకుని వచ్చారు. అందులో విస్తృతితో పాటు జీవన వ్యవహారాలకు సంబంధించిన అన్ని కోణాలలోనూ వినాయింపులున్నాయి.

ఈ సందేశానికి ధ్వజవాహకులయిన వారు కార్యసాధన కోసం ఎలాంటి పద్ధతి అవలంబించాలో కూడా మహాప్రవక్త (సఅసం) తెలిపారు :

"సౌలభ్యాలు కలగజేయండి, ఇబ్బందుల్లో పడవేయకండి, శుభ విషయాలు వినిపించండి, ద్వేషానికి తావీయకండి."

"మీరు (ఇతరులకు) సౌలభ్యాలు కలగజేయడానికి పంపబడ్డారు. కష్టాల్లో పడవేయడానికి కాదు."

"దైవప్రవక్త (సఅసం)కు రెండు విషయాల్లో ఒకదాన్ని అవలంబించడానికి అవకాశం ఇచ్చినప్పుడల్లా ఆయన ఆ రెంటిలో పాపానికి సంబంధించిన విషయం కానట్లయితే అతి సులభమైన దాన్నే అవలంబించే వారు. దీనికి భిన్నంగా ఆయన ఎన్నడూ వ్యవహరించలేదు." (బుఖారీ, ముస్లిమ్)

"అల్లాహ్ మృదు మనస్కుడు, (మానవుల) ప్రతి వ్యవహారంలో కూడా ఆయనకు మృదువైఖరి అంటేనే ఇష్టం." (బుఖారీ, ముస్లిం)

"మృదుత్వాన్ని కోల్పోయినవాడు మంచిని కూడా పూర్తిగా కోల్పోతాడు." (ముస్లిం)

"అల్లాహ్ మృదు మనస్కుడు. ఆయన మృదు మనస్కుడయిన మనిషినే ప్రేమిస్తాడు. కాఠిన్యం ద్వారా గానీ, మరే ఇతర వైఖరి ద్వారాగానీ ప్రసాదించని దానిని ఆయన మృదుత్వం ద్వారా ప్రసాదిస్తాడు." (ముస్లిం)

ఇస్లామీయ జీవన వ్యవస్థ కోసం పనిచేసేవారు ఈ సమగ్ర బోధనలను

దృష్టిలో పెట్టుకోవడంతో పాటు తమ స్వభావాలను, దృక్పథాలను వాటికి అనుగుణంగా మలచుకోవడాన్ని అలవాటు చేసుకుంటే వారిలో సమతులనం, సమదృష్టి, మధ్యస్థవైఖరి వాటంతట అవే ఏర్పడతాయి. ఇలాంటి సమతులనం ద్వారానే వారు ఖుర్ఆన్, హదీసుల ఆధారంగా ప్రపంచ వ్యవహారాలను చక్కబెట్టగలరు. అందువల్ల వారు తమలో సమతులనం జనించే విషయాన్ని గురించి ఆలోచించాలి. స్వప్రయోజనాల కోసం ఖుర్ఆన్, హదీసుల్లో తమకు నచ్చిన విషయాల్ని మాత్రమే ఏరి తీసుకోవడానికి ఎన్నడూ ప్రయత్నించకూడదు.

## 3. సంకుచిత మనస్సు

చిత్తచాంచల్యానికి ఇంచుమించు దగ్గరి చుట్టం సంకుచిత మనస్సని చెప్పవచ్చు. ఖుర్ఆన్‌లో దీన్ని "షుహ్హనఫ్స్" గా అభివర్ణించడం జరిగింది. సంకుచిత మనస్సును గురించి ఖుర్ఆన్ ప్రస్తావిస్తూ "దీనికి దూరంగా ఉండే వ్యక్తికే సాఫల్యం చేకూరుతుంది" అని తెలిపింది. పైగా ఇది తఖ్వా, ఎహ్సాన్‌ల వంటి సద్గుణాలకు పూర్తిగా వ్యతిరేకమైన ఒక కాఠిన్య స్వభావమని కూడా పేర్కొంటున్నది.

ఈ వ్యాధికి గురయిన వ్యక్తి తన జీవితంలో ఇతరుల కోసం అతి తక్కువ మాత్రమే ఇస్తాడు. స్వయంగా అతను ఎంత విస్తరించినా అతని చోటు అతనికి ఇరుకుగానే కనిపిస్తుంది. ఇతరులు ఎంత సర్దుకుని కూర్చున్నా, వారెంతో విస్తరించినట్లు అతనికి అనిపిస్తుంది. అతను తన కోసం ఎన్ని రాయితీలు, మినహాయింపులైనా కోరుకుంటాడు. కాని ఇతరులకు ఎలాంటి రాయితీలు, మినహాయింపులు ఇవ్వడానికి అతనికి మనసొప్పదు.

తనకు సంబంధించిన మంచి విషయాలన్నీ అతని దృష్టిలో సద్గుణాల ఫలితం. కాని ఇతరులకు సంబంధించిన మంచి విషయాలన్నీ యాదృచ్ఛికంగా వచ్చి పడినటువంటివే. తన తప్పులు అతని దృష్టిలో క్షమార్హమయినవి. ఇతరుల తప్పుల్ని మాత్రం అతను క్షమించలేడు. తన కష్టాలను కష్టాలుగా భావిస్తాడు. ఇతరుల కష్టాలన్నీ అతని దృష్టిలో సాకులు మాత్రమే. తన బలహీనతల్ని ఇతరులు దాచాలని కోరుకుంటాడు. ఇతరుల బలహీనతల్ని మాత్రం అతను దాచలేడు. ఇతరులు ఎన్ని ఇబ్బందుల్లో ఉన్నా పట్టించుకోకుండా తన అవసరాల కోసం వారిని జలగలా పట్టి

పీడిస్తాడు. ఈ అవసరాల కోసమే ఇతరులు వస్తే వారి ముందు తన ఇబ్బందులన్నీ ఏకరువు పెట్టి ముఖం చాటేస్తాడు. తనకు నచ్చిన, ఆసక్తికరమైన విషయాల కోసం ఇతరుల గొంతుపై కూర్చుంటాడు. కాని ఇతరులకు ఇష్టమైన, ఆసక్తికరమైన విషయాలను ఖాతరే చేయడు.

ఈ ధోరణి క్రమంగా ముదిరిపోయి రంధ్రాన్వేషణ జాడ్యంగా మారిపోతుంది. తత్కారణంగా మనిషి ఇతరుల్లో ఏ చిన్న పొరపాటు చూసినా వారిని నిలదీస్తాడు. కాని దానికి ప్రతిగా ఇతరులు తన పొరపాట్లను ఎత్తి చూపిస్తే గగ్గోలు పెడ్తాడు.

సంకుచిత మనస్సు వల్ల వచ్చిపడే మరో కీడు అసహనం, అసంతృప్తి, చిరాకు, చిరు కోపాలు. అంటే ఇతరుల్ని సహించకపోవడం, వారిపట్ల తన అసహనాన్ని వెలిబుచ్చుకోవడం అన్నమాట. సామూహిక జీవితంలో ఈ ప్రవృత్తి వల్ల దీనికి గురయిన వ్యక్తికి బాధే, అతనితో వ్యవహారం పెట్టుకునే వారికీ బాధే.

ఈ జాడ్యం సంస్థకు ప్రమాద సంకేతం లాంటిది. సామూహిక పోరాటం జరిపే వారి మధ్య ఎల్లప్పుడు పరస్పర సహకారం, సానుభూతులు తొణికిసలాడుతూ ఉండాలి. ఇవి లేకుండా ఏ సామూహిక కార్యమూ ముందుకు సాగదు. సంకుచిత స్వభావం సంస్థలో సహకారం, సానుభూతులను క్షీణింపజేయడమే కాదు, ఒక్కొక్కసారి వాటిని పూర్తిగా హరించి వేస్తుంది. తత్ఫలితంగా సభ్యుల మధ్య సంబంధాలు చెడిపోతాయి, పరస్పర వైషమ్యాలు జనిస్తాయి. ఇది హృదయాలను వేరుచేసి స్నేహితుల మధ్య పొరపొచ్చాలు కలిగించే అంటువ్యాధి. ఈ వ్యాధికి గురయినవారు సాధారణ సామాజిక జీవితంలో కూడా మసలుకోవడానికి అర్హులు కారు. అలాంటప్పుడు ఉన్నత ఆశయం కోసం పని చేయడానికి వారు ఎలా అర్హులవుతారు?

ప్రత్యేకంగా ఇస్లామీయ జీవన వ్యవస్థ స్థాపనా కృషికి కావలసిన గుణగణాలకు ఇది పూర్తిగా విరుద్ధమైన గుణం. ఈ పని కోసం సంకుచిత మనస్సుకు బదులు విశాల హృదయం, పిసినారితనానికి బదులు ఔదార్యం, తప్పులు పట్టే వైఖరికి బదులు క్షమాగుణం, కాఠిన్యానికి బదులు సడలింపులు అవసరం. తమ స్వవిషయంలో కఠినంగా, ఇతరుల విషయంలో మృదువుగా వ్యవహరించే గొప్ప ఉదారస్వభావులే

ఈ భారాన్ని మోయగలరు. వీరు తమకోసం తక్కువ మినహాయింపులు, ఇతరుల కోసం వీలైనన్ని ఎక్కువ మినహాయింపులు కోరుకుంటారు. వీరిదృష్టి ఎల్లప్పుడూ తాము చేసిన పొరపాట్లపై, ఇతరులు చేసే మంచి విషయాలపై మాత్రమే ఉంటుంది. వీరు ఇతరులకు బాధ కలిగించే బదులు ఇతరులు కలిగించే బాధను దిగమింగే సహనమూర్తులు. వారు నడిచే వారిని పడత్రోయడానికి బదులు పడిపోతున్న వారిని పొదివి పట్టుకునే ఆపద్బాంధవులు.

ఇలాంటి సజ్జనులతో కూడిన సంస్థ స్వతహాగా సంఘటితమయి ఉండటమే గాక, తన పరిసర సమాజంలో చెదరిపోయి ఉన్న విభాగాలను కూడా సమీకరించి తనలో కలుపుకుంటూ పోతుంది. దీనికి భిన్నంగా సంకుచిత మనస్కులు, సహనం లేని వ్యక్తులతో కూడిన సమూహం తాను స్వయంగా చెదరిపోవడమే గాకుండా, తనకు తారసపడిన బయటి వారికి కూడా అసహ్యం కలిగించి తన నుంచి దూరం చేసుకుంటుంది.

## 4. బలహీన సంకల్పం

మనుషుల్లో సర్వసాధారణంగా గోచరించే మరో బలహీనత కూడా ఉంది. దాన్ని మనం బలహీన సంకల్పం అని చెప్పుకుందాం.

దృఢ సంకల్పం లేని మనిషి ఇస్లామీయ ఉద్యమంలో మనస్ఫూర్తిగానే ప్రవేశించి ప్రారంభంలో అమితమైన ఉత్సాహం ఉద్వేగాలు కనబరుస్తాడు. అయితే కాలం గడచిన కొద్దీ అతని ఉత్సాహం క్రమేణా చప్పబడిపోతుంది. చివరికి ఏ లక్ష్యసాధన కోసం అతను రంగంలోకి దిగాడో ఆ లక్ష్యం పట్ల అతని ఆసక్తి పూర్తిగా సన్నగిల్లిపోతుంది. ఆ లక్ష్యం కోసం ఏర్పడిన సంస్థ పట్ల కూడా అతని క్రియాత్మక సంబంధం సడలిపోతుంది.

అతను ఏ సాక్ష్యాధారాల కారణంగా ఈ ఉద్యమం సరయినదని సముచితమైనదని ఒప్పుకున్నాడో ఆ సాక్ష్యాధారాలపై ఇప్పుడతనికి తృప్తి మాత్రమే మిగిలి ఉంటుంది. ఉద్యమం సత్యమయినదేనని అతను నలుగురి ముందు సగర్వంగా చెప్పుకుంటూ ఉంటాడు కూడా. కాని ఉద్యమం పట్ల అతని భావోద్రేకాలు చల్లబడిపోతాయి. అతని క్రియాసక్తి మందగించిపోతుంది. అతని ఉత్సాహం నీరు కారిపోతుంది.

ఉద్యమం గురించి అతనిలో ఎలాంటి దురుద్దేశం ఉండదు. ఉద్యమ లక్ష్యం పట్ల కూడా అతనిలో ఎలాంటి తిరస్కారభావం ఉండదు. అతని సిద్ధాంతాలలో కూడా మార్పు రాదు. అందువల్ల అలాంటి వ్యక్తి సంస్థను విడనాడాలని ఆలోచించడు. అతని సంకల్పం మాత్రమే బలహీనమైనది. దానికి ఆరంభశూరత్వమే గాని శాశ్వత ధీరత్వం ఉండదు. అందుకే అది ఉత్సాహం వేడి కాస్తా చల్లారిన తరువాత వివిధ రూపాల్లో తన అసమర్థతా లీలల్ని చూపడం మొదలెడుతుంది.

బలహీన సంకల్పం మొదట సాకుల రూపంలో వ్యక్తమవుతుంది. అంటే మనిషి ఉద్యమ బాధ్యతల నుండి తప్పించుకోవడానికి ప్రయత్నిస్తాడు. ధ్యేయమార్గంలో ధనం, శ్రమ, సమయం వెచ్చించడానికి వెనకాడుతుంటాడు. అతను తన జీవిత పరమావధిగా నిర్ణయించుకొని చేపట్టిన పని కంటే తన ప్రాపంచిక పనులకే ఎక్కువ ప్రాధాన్యతనిస్తాడు. తన జీవిత ధ్యేయమని చెప్పుకునే పనిలో అతని శ్రమ, సమయం, సంపద నామమాత్రంగానే వినియోగమవుతాయి. అతను సత్యధర్మం ప్రాతిపదికపై ఏర్పడిన సంస్థ ఇదేనని ప్రవేశించిన సంస్థ పట్ల కూడా అతని సంబంధాలు నామమాత్రంగానే ఉంటాయి. దాని మంచి చెడుల పట్ల అతనికి ఎలాంటి శ్రద్ధ ఉండదు. దాని పర్యవసానాలు, కార్యకలాపాల పట్ల కూడా అతనికి ఆసక్తి ఉండదు.

మనిషి యౌవనం నుండి వృద్ధాప్యంలోకి పోయినట్లు సంకల్ప శక్తి లేని వ్యక్తిపై ఈ పరిస్థితి క్రమంగా ఆవరిస్తుంది. అతను స్వయంగా ఈ పరిస్థితి మత్తు నుండి మేల్కోకపోతే, ఇతరులు కూడా అతడ్ని తట్టిలేపకపోతే మరింత ప్రమాదంలో పడిపోతాడు. తాను ఏ పనినయితే తన జీవిత ధ్యేయంగా నిర్ణయించుకొని ధన ప్రాణాలు ధారపోయడానికి సిద్ధమయ్యాడో ఆ పని పట్ల తన వైఖరి ఇలా మారిపోయిందేమిటి అని కూడా అతను ఆలోచించడు. అజాగ్రత్త, అలక్ష్యం, ఏమరుపాటుల్లో పడిపోయిన మనిషిలో ఆసక్తి, అనుబంధాలు నిర్జీవమయిపోతాయి. చివరికి ఈ అలసత్వం ఏమరుపాటుల్లోనే అతను తన సహజ మరణాన్ని చవిచూస్తాడు.

సంస్థాగత జీవితంలో మనిషి ముందుగానే ఈ పరిస్థితి గురించి జాగ్రత్తవహించి దాని పెరుగుదలను అరికట్టే ప్రయత్నం చేయకపోతే, అతని బలహీన సంకల్పం అనే అంటురోగం సంకల్ప బలహీనతగల ఇతరులకు కూడా సోకడం ప్రారంభమవుతుంది.

ఊగిసలాడే వాడికి ఇలా త్రోసేవాడి సాకు దొరుకుతుంది. గొప్ప క్రియాశీల కార్యకర్తలు సయితం పని చేయని కార్యకర్తల్ని చూసి నిరుత్సాహంతో పని చేయడం మానేస్తారు. కాని వారిలో ప్రతి దైవదాసుడు కూడా తాను తన జీవిత ధ్యేయం కోసమే ఈ సేవ చేస్తున్నాడు కాని ఇతరుల కోసం కాదని కాస్తయినా భావించడు. ఇతరులు తమ జీవిత నిజ లక్ష్యాన్ని వదిలేసి కూర్చుంటే తానెందుకు తన జీవిత లక్ష్యాన్ని వదులుకోవాలి అని కూడా ఆలోచించడతను.

తోటివాళ్ళు స్వర్గసోపానాలు ఎక్కడం మానేస్తే తాను కూడా ఎక్కడం మానేస్తాడన్నాడట! ఎవరో తన గమ్యం అసలు స్వర్గం కాదన్నట్లు. లేదా ఇతరులు కూడా స్వర్గానికి వెళ్తేనే తాను స్వర్గానికి వెళ్తానని షరతు పెట్టాడు కాబోలు! ఇతరులు నరకంలో పడాలని నిర్ణయించుకుంటే తాను కూడా నరకంలో దూకడానికి సిద్ధమేనని కూడా అతను భావించి ఉంటాడు!! అతనికి తనదంటూ ఒక లక్ష్యం ఏదీ లేదు. ఇతరుల లక్ష్యమే అతని లక్ష్యం కూడా. అందుకే అతను ఇతరులు స్వర్గానికిపోతే తానూ స్వర్గానికి, ఇతరులు నరకానికిపోతే తానూ నరకానికి పోవడానికి సిద్ధమయ్యాడు!

మన కార్యకర్తల పరిస్థితి కూడా అచ్చం ఇలాగే ఉంది. ఇతరులు పని చేస్తేనే తాము చేస్తామని, ఇతరులు మానేస్తే తాము కూడా చేతులు దులుపుకుంటామని భావించే మనస్తత్వం చాలా ప్రమాదకరమైనది. ఇలాంటి మనస్తత్వం కలిగిన కార్యకర్తలు ఎల్లప్పుడూ పని చేయని కార్యకర్తలనే ఉదాహరిస్తుంటారు. పనిచేసే కార్యకర్తలు వీరికి ఆదర్శప్రాయులుగా కానరారు.

సంకల్ప బలం అంతగా లేని కార్యకర్త సహజంగానే డీలా పడిపోతాడు. ఆ స్థితిలోనే ఉండిపోతాడు. అంతవరకైతే బాగానే ఉంటుంది. కాని మనిషి ఒక బలహీనతకు గురయ్యాడంటే దాంతోపాటు మరికొన్ని బలహీనతలు కూడా అతడ్ని చుట్టుముట్టుతాయి. ఒక బలహీనత కారణంగా మరో బలహీనత ఏర్పడకుండా దాన్ని అణచివేసే శక్తి బహుకొద్ది మందికి మాత్రమే ఉంటుంది. అందువల్ల ఒక బలహీనత ఏర్పడినప్పుడే మనిషి దాన్ని దూరం చేసే ప్రయత్నం చేసుకోవాలి. తనను తాను బలహీనుడని భావించడం, తన బలహీనతను వెలిబుచ్చడం లేదా తనను ఇతరులు బలహీనుడిగా భావిస్తుంటే దాన్ని సహించడం వాటిపట్ల మనిషి సాధారణంగా

సిగ్గుపడతాడు. అయితే తన సంకల్ప బలహీనతే తననిలా మందమతిగా మార్చివేసిందని మాత్రం అతను నేరుగా అంగీకరించడు. పైపెచ్చు దాన్ని కప్పిపుచ్చుకోవడానికి అనేక పద్ధతుల్ని అవలంబిస్తాడు. ప్రతి పద్ధతి రెండవ దానికన్నా ఘోరమైనదిగా పరిణమించి బెడిసికొడ్తుంది.

ఉదాహరణకు పని చేయకుండా ఉండేందుకు రకరకాల సాకులు వెతుకుతాడు. సోమరిపోతుకు సవాలక్ష సాకులన్నట్లు వెతికితే ఏదో ఒక కుంటిసాకు దొరక్కపోదు. పని చేయకపోవడానికి అసలు కారణం ఉద్యమ ధ్యేయం పట్ల తనకు ఆసక్తి తగ్గడం కాదని, నిజంగానే తాను కొన్ని సమస్యల్లో చిక్కుకున్నానని, లేదా కొన్ని అవాంతరాలు వచ్చిపడ్డాయని స్నేహితుల్ని నమ్మించటానికి ఏదో ఒక వంక చూపుతాడు. అంటే తన అలసత్వం దాచడానికి అబద్ధాన్ని ఆహ్వానిస్తున్నాడన్నమాట. ఇక్కడ్నించే అతని నైతిక పతనం ప్రారంభమవుతుంది.

ఏ సాకయినా అతను ఎంత కాలమని చెప్పి జనాన్ని నమ్మించగలడు? ఈ సాకు కాస్త పాతబడి నిరుపయోగమయిన తరువాత, తన బలహీనత బండారం బయటపడుతుందని భయపడి ఏకంగా సంస్థపైనే బురదజల్లడానికి ప్రయత్నిస్తాడు. అసలు తనేదో బలహీనత వల్ల ఢీలా పడిపోలేదని, సంస్థలోని కొన్ని లోపాలే తననిలా ఢీలాపడిపోయేలా చేశాయని మరో కుంటిసాకు చెప్పడానికి వృధా ప్రయాసపడుతుంటాడు. అంటే తాను సంస్థ కోసం ఎన్నో పనులు చేయాలనుకున్నాను గాని, ఏం చేయను, తోటి కార్యకర్తల చేష్టలు తన హృదయాన్ని విరిచేశాయి అన్న భావాన్ని అతని కుంటిసాకు చెప్పకనే చెబుతుందన్నమాట. ఈ విధంగా పడిపోతున్న మనిషి ఒక్కచోట కూడా నిలదొక్కుకోలేకపోతే పతనం ఊబిలోకి మరింత దిగజారిపోతూనే ఉంటాడు. బలహీనతను కప్పిపుచ్చుకునే ఈ కాంక్ష అతనిలో నానాటికి బలం పుంజుకుంటూ, చివరికి అతను చేయలేకపోయిన ధ్యేయాన్ని చెడగొట్టేందుకు అతడ్ని ప్రేరేపిస్తుంది.

ప్రారంభ దశలో ఈ అయిష్టత, అనాసక్తతల వ్యవహారం చాలా తేలికగా ఉంటుంది. ఆయన గారికి పని మీద ఎందుకు అయిష్టత ఏర్పడిందో, ఎందుకు ఆయనగారి మనస్సు చెదిరిందో ఎవరికీ అర్థం కాదు. మసకవెల్తురులో మొలకెత్తిన

ఈ చెడుగుల రూపురేఖలు మొదట్లో అస్పష్టంగా కనిపిస్తాయి. వాటి వివరాలు, విశ్వరూపం అప్పుడు బహిర్గతం కావు. అలాంటి సమయంలో తోటి కార్యకర్తలు కాస్త తెలివిగా వ్యవహరిస్తూ ఈ వ్యాధి లక్షణాలేమిటో తెలుసుకుని చేయూత అందిస్తే పడిపోతున్న ఈ వ్యక్తి మరీ పడిపోకుండా ఆగిపోగలడు. మరింత ప్రయత్నిస్తే అతడ్ని పూర్తిగా పైకి లేవదీయవచ్చు కూడా.

కాని ముందు చూపులేని మన కార్యకర్తలు కొందరు వీరావేశంతో లేచి, తమ తొందరపాటు దాహాన్ని తీర్చుకోవడానికి లోతుల్లోకి పోయేందుకు ప్రయత్నిస్తారు. అసలీ అనాసక్తత, అయిష్టతలకు కారణం ఏమిటో కాస్త వివరంగా చెప్పమంటూ అతడ్ని గుచ్చి గుచ్చి అడుగుతారు.

ఆ తరువాత ఈ వ్యక్తి తన అయిష్టత, ఏవగింపులు సరయినవేనని నిరూపించడానికి నిదర్శనాల కోసం నలువైపులా దృష్టి సారిస్తాడు. వివిధ కార్యకర్తల బలహీనతల్ని ఏరి ఏరి పోగుచేస్తాడు. సంస్థలో కూడా కొన్ని లోపాలను వెతికి సిద్ధం చేసుకుంటాడు. వీటన్నిటితో ఒక జాబితా తయారుచేసి, ఇవిగో! ఈ చెడుగుల కారణంగానే తనలో పని పట్ల అయిష్టత ఏర్పడిపోయిందంటూ ఆ జాబితాను వారి ముందు పెడ్తాడు.

మరోమాటలో చెప్పాలంటే – ఎలాంటి బలహీనతలు లేని నాలాంటి పవిత్రుడు, పరిపూర్ణ పురుషుడు ఇన్ని బలహీనతలు కలిగి ఉన్న ఈ కార్యకర్తలతో కలసి, ఇన్ని లోపాలున్న ఈ సంస్థలో ఉండి ఎలా పని చేసి ముందుకు పోగలడు? అని తన బలహీనతను కప్పిపుచ్చే ఓ ముసుగు నిదర్శనాన్ని వారికి చూపుతాడు.

కాని ఈ నిదర్శనాన్ని చూసేటప్పుడు అతను ఒక విషయాన్ని మరచిపోతున్నాడు. తానన్నట్లు పరిస్థితి నిజంగానే ఇలా ఉండినట్లయితే తాను ఢీలాపడిపోవడానికి బదులు మరింత ఉత్సాహంతో పని చేయాల్సిన అవసరముంది కదా? తాను తన జీవిత లక్ష్యంగా పెట్టుకుని పనిచేయడానికి సమాయత్తమయిన కార్యాన్ని ఇతరులు తమ బలహీనతలతో పాడు చేస్తుంటే తాను మరింత ఉత్సాహం ఉద్వేగాలతో దాన్ని బాగుచేయడానికి కృషి చేయవచ్చుకదా? ఆ విధంగా తాను చేసే మంచి పనులతో

ఇతరుల దోషాలను ఎందుకు దూరం చేయడానికి ప్రయత్నించలేదు? తన ఇల్లు కాలిపోతున్నప్పుడు ఇంట్లోని ఇతర సభ్యులు దాన్ని ఆర్పలేని స్థితిలో ఉంటే, తాను వారిని ఏవగించుకొని అనాసక్తతతో కూర్చుండిపోవాలా లేక ఇంటిని కాపాడుకోవడానికి ఆ నిర్బలులకంటే రెట్టింపు ఉత్సాహం చూపాల్నా? ఈ వాస్తవాన్ని గురించి ఆయనగారు ఆలోచించలేకపోతున్నాడు. షైతాన్ అతడ్ని ఈ విషయం మరిపింపజేస్తున్నాడు.

ఈ విషయంలో అత్యంత విచారకరమైన అంశం – మనిషి తన తప్పుల్ని కప్పిపుచ్చుకునే తాపత్రయంలో, పని పట్ల తన అనాసక్తత సరయినదేనని నిరూపించుకునే ఆరాటంలో అంధుడయిపోయి తన కర్మల పత్రంలోని చెడులన్నింటిని తీసి ఇతరుల కర్మల పత్రంలో పడవేయడానికి పడరాని పాట్లుపడతాడు. కాని ఎలాంటి నక్కజిత్తులతోనయినా ఒక్క విషయం కూడా మారిపోలేని కర్మల రికార్డు కూడా ఒకటి ఉందన్న సంగతి అతను మరచిపోతున్నాడు. అతనికి ఇతరుల కర్మ పత్రంలో ఎన్నో బలహీనతలు కనిపిస్తాయి. తనలో ఎన్ని బలహీనతలు ఉన్నా తన కర్మ పత్రంలో మాత్రం అతనికి ఒక్క బలహీనత కూడా కనిపించదు.

అతను సంస్థ తీరు తెన్నులో కూడా ఎన్నో లోపాలను ఎత్తి చూపిస్తాడు. కాని ఆ లోపాలు ఏర్పడటంలో అందరికంటే తన ప్రమేయమే ఎక్కువగా ఉందని అతను గ్రహించడు. తప్పుల్ని తాను స్వయంగా కొనితెచ్చుకున్నా అవి ఇతరుల ద్వారా సంక్రమించాయని నిందారోపణలు చేస్తూ తిరుగుతాడు. అందుకే తనకు ఈ పని పట్ల ఏవగింపు కలిగిందని చెబుతూ ముందుకాళ్ళకు బంధాలు వేస్తాడు. ఇలా అతను ఈ విషయాలన్నిటికీ తానేమాత్రం బాధ్యుడ్ని కానని చెప్పకనే చెప్పి పని దొంగయి కూర్చుంటాడు.

మానవుడన్నాక ఏదో బలహీనత లేకుండా ఉండదు. మానవ కార్యంలో పొరపాట్లు జరగడం కూడా సహజమే. అలాంటి మానవులతో కూడిన సంఘంలో లోపం అనేదే లేకుండా ఎలా ఉంటుంది? మానవ సమాజ సంస్కరణ కోసం దైవదూతలు దిగివచ్చి, రవ్వంత పొరపాటు లేకుండా, అణుమాత్రం లోపం లేకుండా అంతా నూరుశాతం సవ్యంగా చేసినట్లు ప్రపంచంలో మనకెక్కడా దాఖలా కనపడదు.

లోపాలు వెతకడం ప్రారంభిస్తే అవి కనిపించని దెక్కడ? మానవ కార్యాలన్నీ పొరపాట్లు, బలహీనతలతోనే ఉంటాయి. అత్యున్నత ప్రమాణాలు నెలకొల్పడానికి చేయగలిగిన ప్రయత్నాలన్నీ చేసినప్పటికీ, ఈ మానవ జగత్తులో పొరపాట్ల ఛాయ లేశమయినా ఏర్పడకుండా ఉంటుందని ఎన్నటికీ ఆశించలేము.

ఇలాంటి పరిస్థితిలో పొరపాట్లను, బలహీనతల్ని దూరంచేసి పనిని ప్రామాణిక స్థాయికి చేర్చేందుకు మరింత కృషి జరగాలన్న సదుద్దేశంతో వాటిని ఎత్తిచూపిస్తే అంతకంటే, గొప్ప శుభకార్యం మరొకటి ఉండదు. మానవుల పనుల్లో ఇలాంటి పద్ధతుల ద్వారానే సంస్కరణ పురోభివృద్ధులు సాధ్యమవుతాయి. దాన్ని విస్మరిస్తే కలిగే పర్యవసానం నాశనమే. దానికి భిన్నంగా పని చేయకుండా చేతులు ముడుచుకొని కూర్చోవడానికి సాకులు చూపే ఉద్దేశంతో వ్యక్తిగత బలహీనతల్ని, సామూహిక పొరపాట్లను వెతకడం ప్రారంభిస్తే అదొక షైతాన్ చర్య. దుష్టవాంఛాప్రేరణ మాత్రమే అవుతుంది.

సాకులు వెతికేవాడికి ఎంతటి ఉత్తమోత్తమ సంఘంలో కూడా, ఎలాంటి మంచి పరిస్థితిలోనయినా ఏదో ఒక సాకు దొరక్కపోదు. మానవ సంఘాలలోని మానవులకు బదులు వారి స్థానాల్లోకి దైవదూతల సమూహం ఒకటి దిగిరానంత వరకు ఈ నెపాన్ని నిర్మూలించడం సాధ్యం కాదు. స్వయంగా తనలో ఎలాంటి లోపాలు, బలహీనతలు లేవని ఆచరణాత్మకంగా నిరూపించుకోలేని వ్యక్తికి పని విషయమయి సాకులు చూపడం ఏమాత్రం శోభించదు. ఇలాంటి మాటల వల్ల బలహీనతలు, లోపాలు దూరం కావు. పైపెచ్చు వాటి పెరుగుదలకై ఈ మాటలు దోహదపడతాయి.

ఇలాంటి వ్యక్తి సదా సాకులతోనే కాలక్షేపం చేస్తూ సంకల్ప బలం లేని ఇతర కార్యకర్తలందరికీ ఆదర్శప్రాయుడయిపోతాడు. మీరు మీ దౌర్బల్యాన్ని ఒప్పుకొని మిమ్మల్ని మీరు సంతోషంగా మోసగించుకోండని ఇతను వారందరికీ తన ఆత్మ ద్రోహం మార్గాన్ని చూపిస్తాడు. అతని అడుగుజాడల్లో నడిచే ప్రతి సోమరిపోతూ

తన అయిష్టతా నటనాచాతుర్యాన్ని ప్రదర్శించడం ప్రారంభిస్తాడు. పైగా తన అయిష్టత, ఏవగింపులు ముమ్మాటికీ సరయినవేనని నిరూపించుకోవటానికి ఇతర కార్యకర్తల బలహీనతల్ని సంస్థలోని లోపాలను వెతికి వెతికి ఒక జాబితాను రూపొందిస్తాడు. ఈ విధంగా ఇతను కూడా పతనాగాధం వైపునకు పరుగెత్తుతాడు.

ఇతను అవలంబించిన ఈ దుష్ప్రచార వైఖరి ద్వారా తాను స్వయంగా చెడిపోవడమే గాకుండా తోటి కార్యకర్తల్ని కూడా చెడగొడ్తూ ఉంటాడు. అతను సాగించే ఈ నిందారోపణ చర్చలకు మంచి మంచి కార్యకర్తలు కూడా ప్రభావితులయి అయిష్టతా ఏవగింపుల జాడ్యానికి గురయిపోతారు. ఈ రోగ నివారణ కోసం ఏదైనా చేయబోతే అయిష్టతా అనాసక్తతల వ్యాధిగ్రస్తుల కూటమి ఒకటి ఏర్పడటం మొదలవుతుంది. చివరికి ఈ అయిష్టతా ఏవగింపుల సమస్య కోసం ఒక ఉద్యమమే ఉనికిలోకి వస్తుంది. అయిష్టతకు గురికావడం, అయిష్టతను కలిగించడం, అయిష్టతకు ఆధారాలు సేకరించడం ఆ ఉద్యమం కర్తవ్యమయిపోతుంది. అసలు లక్ష్యం కోసం పని చేయడంలో అలసత్వం చూపిన వారంతా ఇప్పుడు ద్విగుణీకృత ఉత్సాహంతో ఈ ఉద్యమంలో చేరి తన ప్రతిభా పరాక్రమాల్ని ప్రదర్శించుకోవడం ప్రారంభిస్తారు. అంటే వారి చచ్చిపోయిన ఆసక్తి తిరిగి బ్రతికిందన్నమాట! కాని అది మళ్ళీ బ్రతకడం దాని చావుకన్నా ఎంతో తీవ్రమైన విషయం.

ఇదొక ప్రమాదకరమైన పరిణామం. ధర్మ సంస్థాపనకై ఉద్యమించిన సంస్థ దీని పట్ల అప్రమత్తంగా ఉండాలి. దాని నాయకులు, కార్యకర్తలు బలహీన సంకల్పం తెచ్చే అనర్థాలను గురించి, దాని వివిధ రూపాల ప్రభావాలను గురించి క్షుణ్ణంగా అర్థం చేసుకోవాలి. దాని ప్రారంభ సూచనలు కనిపించగానే సంస్కరించడానికి సిద్ధం కావాలి.

సంకల్ప దౌర్బల్యం సూచనలు ప్రారంభంలో ఇలా కనిపిస్తాయి. సంస్థలో ఎవరైనా ఒక కార్యకర్త తన సంస్థ సరయిన దృక్పథం గల మంచి సంస్థేనని, అది చేపట్టిన లక్ష్యం కూడా సరయినది సహేతుకమయినదేనని అంగీకరించి కూడా ఆచరణలో అశ్రద్ధ, అనాసక్తతలు కనబరుస్తాడు. ఈ పరిస్థితి తలెత్తగానే దానిని రూపుమాపేందుకు కొన్ని తెలివైన చర్యలు తీసుకోవాలి.

సంస్థ మొట్టమొదట ఆ కార్యకర్తలోని అనాసక్తత, అలసత్వాలకు కారణం అతని సంకల్ప దౌర్బల్యమేనా, లేక నిజంగానే అతడ్ని బద్ధకస్తుడిగా మార్చివేసిన అవరోధాలు ఏవైనా ఉన్నాయా అన్న విషయాన్ని గురించి తెలుసుకోవాలి. ఒకవేళ నిజంగానే అలాంటి అవరోధాలేవయినా ఉంటే సంస్థ వెంటనే వాటిని దూరం చేయడానికి ప్రయత్నించాలి. అతని బద్ధకం ఇతర కార్యకర్తల్లో అపార్థాలకు కారణం కాకుండా ఉండాలి. అతని బద్ధకం చూసి ఇతరులు కూడా బద్ధకస్తులయ్యే ప్రమాదం పట్ల జాగ్రత్త వహించాలి.

అతని అలసత్వానికి అసలు కారణం అతని సంకల్ప బలహీనతేనని తేలిపోతే మాత్రం సంస్థ జాగ్రత్తగా అడుగువేసి నేర్పుగా వ్యవహరించవలసి ఉంటుంది. వాస్తవమైన అవాంతరాలు, ఇబ్బందుల కారణంగా సంస్థ కార్యకలాపాల్లో చురుకుగా పాల్గొనలేకపోతున్న కార్యకర్తల పరిస్థితి వేరు, ఇతని పరిస్థితి వేరు. ఈ వ్యత్యాసం కనబడేలా సంస్థ తెలివిగా తగిన చర్యలు తీసుకోవాలి.

సంకల్పబలం లేని కార్యకర్తను గురించి సమాచారం అందగానే సంస్థ సమయస్ఫూర్తిగా వ్యవహరిస్తూ అతనికి తగిన హితోపదేశం చేసి దాన్ని దూరం చేయడానికి ప్రయత్నించాలి. సంస్థలో ఉండే అత్యుత్తమ వ్యక్తుల్ని ప్రత్యేకంగా ఈ పనికోసం నియమించి అతనిలో నిర్వీర్యమయిపోతున్న కార్యశీలతను ఉత్తేజపరచాలి. వారతడ్ని తమతో పాటు కలుపుకొని పనిచేస్తూ, అతనిలో చలనాన్ని కలిగించడానికి కృషి చేయాలి.

సంస్థలో ఇలాంటి అలసత్వం, అనాసక్తతలు సర్వసామాన్యమయిపోయి ఇతరులు చూసి నేర్చుకునే అవకాశం లేకుండా చేసేందుకు ఈ బద్ధకస్తుడ్ని సందర్భోచితంగా విమర్శిస్తూ ఉండాలి. శ్రమ, సమయం, సంపదల్ని ఎవరు ఎంత త్యాగం చేయగలుగుతారని, ఎంత చేస్తున్నారని, ఎవరు తమ శక్తి సామర్థ్యాల మేరకు పని చేస్తున్నారని సంస్థ తరచుగా విచారిస్తూ ఉండాలి. ఈ విచారణలో బద్ధకస్తుడి బండారం బయటపడిపోతుంది. దాంతో అతను కాస్తయినా సిగ్గుపడి తన బద్ధకాన్ని దూరం చేసుకోవడానికి ప్రయత్నించవచ్చు. ఇలాంటి విచారణ సమావేశాల వల్ల బిడియస్తులు పనిలో ఢీలాపడిపోకుండా ఉండగలుగుతారు.

అయితే ఈ విచారణ ఎంతో జాగ్రత్తగా జరపవలసి ఉంటుంది. మొరటు పద్ధతులకు ఏమాత్రం ఆస్కారం ఇవ్వకూడదు. వాటివల్ల ప్రారంభదశలో ఉన్న సంకల్ప బలహీనత అనే సాధారణ జ్వరం కాస్తా టైఫాయిడ్ జ్వరమయిపోతుంది. అందువల్ల ఇలాంటి వ్యాధిగ్రస్తుల పట్ల వివేకంగా వ్యవహరించాలి.

ఒక వ్యక్తిలో ఏదైనా బలహీనత చోటు చేసుకుంటున్నప్పుడు దాన్ని దూరం చేయలేకపోతే, దాన్ని తీవ్రమయిపోకుండా కనీసం అరికట్టడానికైనా ప్రయత్నించాలి. మూఢుని ముందు అవసరమైన దానికంటే అధికంగా సంస్కరణావేశం ప్రదర్శిస్తే, ముందే ఒక చెడుగులోపడి ఉన్న ఈ మనిషి అంతకంటే ఘోరమైన మరో చెడుగులోకి కూరుకుపోయే ప్రమాదం ఉంది. దీనికి మన సంస్కర్తలు కూడా బాధ్యులేనని గ్రహించాలి.

సంకల్ప దౌర్బల్య రోగం ముదిరితే దాని లక్షణాలు ఇలా ఉంటాయి : మనిషి తన బలహీనతను కప్పిపుచ్చుకోవడానికి దానిపై అబద్ధం, అబద్ధపు ఎత్తుగడల ముసుగువేస్తాడు. కొన్నాళ్ళకు ఆ తాపత్రయం వృధా అయిపోగానే 'ఆత్మరక్షణ' కోసం ఏకంగా సంస్థపైనే తన విమర్శనాస్త్రాలు ఎక్కుపెడతాడు. లోపం తనలో లేదు, సంస్థలోనే ఉందని ఆరోపిస్తాడు. ఇది కేవలం బలహీనత మాత్రమే కాదు, ఒక దుర్గుణం కూడా. సచ్ఛీలం, సద్గుణాల ప్రాతిపదికలపైన్నే పనిచేస్తూ ప్రపంచాన్ని సంస్కరించదలచిన ఇస్లామీయ సంస్థలో ఈ వ్యాధిక్రిములు వృద్ధి చెందకుండా అరికట్టేందుకు ప్రయత్నించాలి.

ఈ వ్యాధి మొదటి లక్షణం – మనిషి పని చేయకపోవడానికి కారణంగా అతను అసత్యసాకులు, ఆధారంలేని వంకలు చూపెడతాడు. దీన్ని ఉపేక్షించడం వల్ల ఒక వైపు ఈ దుర్లక్షణానికి గురయిన వ్యక్తిపట్ల విశ్వాస ఘాతుకం చేసినట్లవుతుంది. మరోవైపు ఒక మహోన్నత ఆశయం కోసం తమ ధన ప్రాణాలను త్యాగం చేసే ఉద్దేశంతో అనేకమంది చేరిన సంస్థ పట్ల కూడా విశ్వాస ఘాతుకం తలపెట్టినట్లు అవుతుంది. ఇలాంటి సంస్థలో చేరే ప్రతి వ్యక్తిలో తన బలహీనత కారణంగా పనిచేయలేకపోతే స్పష్టంగా తనలో ఫలాన బలహీనత ఉందని ఒప్పుకునేంతటి కనీస నైతిక ధైర్యమయినా ఉండాలి. బలహీనతను ఒక సారయినా కప్పిపుచ్చుకోవడానికి

అసత్య సాకులు చూపడం కన్నా తప్పును ఒప్పుకొని జీవితాంతం ఆ బలహీనతలోనే పడి ఉండటం ఎంతో మేలు.

ఈ బలహీనత ఎప్పుడు బయటపడినా సరే దాన్ని అణచివేయాలి. దాన్ని ఏమాత్రం ప్రోత్సహించకూడదు. ఏకాంతంలో చెప్పినా అతను తన దురలవాటును మానుకోకపోతే సంస్థ ముందు బహిరంగంగా అతడ్ని అభిశంసించాలి. అతను చెప్పిన సాకుల బండారాన్ని కూడా బయటపెట్టాలి. ఉపేక్షిస్తే అది తీవ్రమయిపోయి, మరిన్ని చెడులకు ఆస్కారమిచ్చే ప్రమాదం ఉంది.

ఈ వ్యాధి రెండవ లక్షణం - బద్ధకస్తుడు, క్రియాశూన్యుడయిన ఒక వ్యక్తి తన దుస్థితికి కారణం కార్యకర్తల బలహీనతలు, సంస్థ పనితీరు, దాని విధానంలోని లోపాలేనని బుకాయిస్తాడు. అందుకే తనకు సంస్థ అంటే కార్యకర్తలంటే అయిష్టత, ఏవగింపులు ఏర్పడ్డాయని అంటాడు. ఇలా అతను తన దోషాలు, బలహీనతల బాధ్యతను సంస్థకు అంటగడ్తాడు. ఈ వైఖరి నిజానికి ఇప్పుడితను ఏదో కీడు చేసే చేష్టలకు దిగబోతున్నాడని తెలుపుతున్న ప్రమాద సంకేతం అన్నమాట. పరిస్థితి ఇంతవరకు వచ్చిన తరువాత అతడ్ని అయిష్టతకు కారణాలు అడగటం అర్థరహితం. ఈ ప్రశ్న అడగటమంటే కీడు, కల్లోలాలకు చేరువయిన అతని చేత వాటిని రేకెత్తింపజేయడమే అవుతుంది.

ఇప్పుడతనికి లోపాలు ఎత్తి చూపే అనుమతి ఇవ్వడానికి బదులు, అతని స్నేహితుల ద్వారా అతనిలో దైవభీతి కలిగించడానికి ప్రయత్నించాలి. లోపాలు, బలహీనతలన్నీ తన దగ్గరే పెట్టుకొని సిగ్గూ ఎగ్గూ లేకుండా ఏ మొహంతో ఇతరులపై బురదజల్లే దుస్సాహసానికి ఒడిగడ్తున్నావు? కష్టపడి పని చేస్తూ ఎల్లప్పుడు సంస్థ సేవలోనే నిమగ్నులయ్యేవాళ్ళు. డబ్బు, సమయం త్యాగం చేసేవాళ్ళు నీ క్రియాశూన్య ధోరణిని తమ అయిష్టతను కలిగించే చెడుగుల్ని సృష్టించడంలో అందరికన్నా నీ పాత్రే ఎక్కువగా, ఇతరుల్ని చెడగొట్టటంలో నీ హస్తమే ముఖ్యమైనదిగా పెట్టుకొని అయిష్టతావేషం వేసుకొని నాటకమాడుతున్నావా? - అని అతని స్నేహితుల చేత చీవాట్లు పెట్టించాలి.

బలహీనతలు, లోపాలు ఎక్కడ ఉన్నాసరే అవన్నీ సంస్థ దృష్టికి రావాల్సిందే. కాదని ఎవరూ అనలేరు. సంస్థ వాటిని గురించి తెలుసుకోవడంలో తాత్సారం చేయకూడదు. తెలిసినప్పుడు వాటి సంస్కరణ కోసం కృషి చేయకుండా ఉపేక్షించడంగాని, చూసీ చూడనట్లు ఉండిపోవడం గాని ఎన్నడూ జరగకూడదు. సంస్థ లక్ష్యం కోసం ప్రాణాలొడ్డి పనిచేసే ప్రథమశ్రేణి కార్యకర్తలే ముఖ్యంగా ఈ బాధ్యతను చేపట్టాలి. వారే దీనికి అర్హులు. వారే నిజాయితీగా విమర్శలు కూడా చేయగలుగుతారు.

సంస్థలో లోపాలను, బలహీనతలను ఎత్తి చూపుతూ, దానిపై లేనిపోని అభాండాలను, అపనిందలను మోసే పనిదొంగలను, బద్ధకస్తులను ఎన్నడూ ప్రోత్సహించకూడదు. నైతిక ఉద్యమ కార్యకర్తలుగా సంస్థ సభ్యులు వీరి ఆటలను సాగనీయకూడదు. ఇలాంటి ఉద్యమంలో ఉంటూ వారు తమ చేష్టల పట్ల సిగ్గుపడాలి. చేసిన తప్పులు ఒప్పుకొని పశ్చాత్తాపం చెందాలి. అంతేగాని ఇతరులపై బురదజల్లే నీచానికి పాల్పడకూడదు. వారే గనక సంస్థ సారథులయి ఉంటే అంతకంటే ప్రమాదకరమైన విషయం మరొకటి ఉండదు. సంస్థలో వారికి ఇలాంటి స్థానాలు ఇవ్వడం అంటే సంస్థ నైతికంగా దివాళా తీయడమేనని వేరే చెప్పనవసరం లేదు.

ఒక సజీవ సచేతన సంస్థలో ఆరోగ్యవంతమైన అంగాలకు, అనారోగ్యమైన అంగాలకు మధ్య వ్యత్యాసం ఏమిటో సంస్థ నాయకులు, కార్యకర్తలు బాగా అర్థం చేసుకోవాలి. పూర్తిగా కార్యదీక్షులయి, తమ ధన ప్రాణాలు, శ్రమా సమయాలు అన్నీ సంస్థ ఆశయం కోసం ధారపోసి పనిచేసే క్రియాశీలక కార్యకర్తలే సంస్థకు ఆరోగ్యవంతమైన అంగాలు. ఏనాడూ ఒళ్ళు వంచి పనిచేయని పని దొంగలు, బద్ధకస్తులు, కొంతకాలం పాటు పనిచేసి చప్పబడిపోయిన ఆరంభశూరులు, సంకల్ప దుర్బలులు సంస్థకు అనారోగ్యమైన అంగాలు. ఆరోగ్యవంతమైన కంటిచూపునకు, అనారోగ్యమైన కంటి చూపునకు ఉన్న తేడాయే వీరిద్దరిలోనూ ఉంది.

సంస్థ తన అనారోగ్య అవయవాల రోగ లక్షణాల ద్వారా మాత్రమే తనలో ఉన్న లోపాలు బలహీనతలను గురించి సరిగా అంచనా వేయగలుగుతుంది. కాని తమ అయిష్టత, ఏవగింపులకు కుంటి సాకులు చెప్పే పని దొంగలు, బద్ధకస్తుల విషయంలో ఈ అంచనా ఒక్కొక్కసారి సరయినది కాకపోవచ్చు. వారు చెప్పే మాటలు,

చేసే పనులు నూరు శాతం కాకపోతే 80 నుంచి 90 శాతం వరకైనా అసత్యమైనవిగా, తప్పుదారి పట్టించేవిగా ఉండవచ్చు. ఇలాంటి వారి అభిప్రాయాల ఆధారంగా సంస్థ తన పని తీరును అంచనా వేయడం సరికాదు. సంస్థ నిర్వాహకులు తమ ముందు సంస్థ బలహీనతలు, లోపాలు రావడం చూడగానే భయపడిపోయి లెంపలు వేసుకోవాలని, వాటి ఆధారంగానే తాము ఏం చేయగలిగే స్థితిలో ఉన్నాం, ఏం చేయలేం అని కూడా నిర్ణయాలు తీసుకోవాలని ఆలోచించడం సరికాదు.

ఇది సత్క్రియ అయితే కావచ్చు. కాని విజ్ఞుల సత్క్రియ మాత్రం కాజాలదు. అమాయకులు, అజాగ్రత్తపరులు చేసే సత్క్రియ ఇది. ప్రపంచంలో ఇలాంటి సజ్జనులు ఇంతకు ముందు కూడా ఎలాంటి ఘనకార్యం సాధించలేదు, ఈనాడు కూడా ఎలాంటి ఘనకార్యాన్ని సాధించలేరు. చెప్పేవాడు పరిస్థితిని ఏ మేరకు అర్థం చేసుకున్నాడో, చెప్పే యోగ్యత అతనికసలు ఉందో లేదో తెలుసుకోకుండా, ప్రతి ఎల్లయ్య, పుల్లయ్య చెప్పే మాటల ఆధారంగా తమ లోపాలను శక్తి సామర్థ్యాలను గురించి అంచనా వేసుకోవడం ఎంతో మూర్ఖత్వంతో కూడిన పని. తమ శక్తి సామర్థ్యాల విషయంలో అతి నమ్మకానికి గురికావడమనే మూర్ఖత్వానికి ఈ మూర్ఖత్వం ఏమాత్రం తీసిపోదు.

ఈ సందర్భంలో బాగా అర్థం చేసుకోవలసిన మరో విషయం ఉంది. ఒక లక్ష్యం కోసం పని చేసే సంస్థ తన ముందు రెండు ప్రమాణాలను పెట్టుకోవాలి. ఒకటి, అత్యున్నత ప్రమాణం. దాన్ని చేరుకోవడానికి నిరంతరం కృషి కొనసాగిస్తూ ఉండాలి. రెండు, కనీసం ఆచరణయోగ్యమయిన ప్రమాణం. అంటే పని నడిపించడానికి కావలసిన కనీస ప్రమాణం అన్నమాట. అయితే దీని క్రిందికి దిగజారే ఏ ప్రమాణాన్ని కూడా సహించకూడదు. ఈ రెండు ప్రమాణాల విషయంలో విభిన్న మనస్తత్వాలు గలవారు విభిన్న ఆచరణ పద్ధతుల్ని అవలంబిస్తారు.

ఒక మనస్తత్వం అసలు లక్ష్యం కోసం చేయవలసిన పనికి అంతగా ప్రాముఖ్యం ఇవ్వదు. ఆ పని బాగయినా, చెడిపోయినా లేక పూర్తిగా అంతమయిపోయినా సరే అది అంతగా పట్టించుకోదు. అది ఆ పనిని మానివేసి కూడా హాయిగా ఉండగలుగుతుంది. ఇలాంటి మనస్తత్వం గలవారు పనిలో పాల్గొని కూడా తమ సమయం, సంపద, శక్తిసామర్థ్యాలు కాస్తయినా కరిగిపోకుడా పని చేస్తారు. ఈ

మనస్తత్వం గలవారు తమ ప్రమాణానికి అంగుళమైనా క్రిందికి దిగేందుకు ఎలాంటి పరిస్థితిలోనూ అంగీకరించరు. ఆ ప్రమాణానికి తక్కువగా ఏ విషయం కన్పించినా వారు ఎంతో ఆందోళన, అసంతృప్తి, అయిష్టతలు వెలిబుచ్చుతారు. అయితే ఈ ఆందోళన పని చేయడానికి కాదు, పని నుండి పారిపోవడానికి వ్యక్తమయిన ఆందోళన. ఈ మనస్తత్వం నుండి వెలువడే మాటలు కోటలు దాటుతాయి కాని దాని కాళ్ళు మాత్రం గడపలు కూడా దాటవు. ఈ మనస్తత్వమే కార్యక్షేత్రం నుండి పారిపోయేవారిని సృజిస్తుంది.

రెండవ మనస్తత్వం లక్ష్యానికి, లక్ష్యం కోసం చేయవలసిన పనికి పూర్తి ప్రాముఖ్యం మటుకు ఇస్తుంది. కాని ఊహాలోకంలో విహరిస్తున్నందున 'అసలు ప్రమాణానికి' ఆచరణ యోగ్యమైన కనీస ప్రమాణానికి ఉన్న వ్యత్యాసం గురించి దీనికి సరయిన అవగాహన ఉండదు. స్వయంగా ఈ మనస్తత్వం కూడా మాటిమాటికీ చిక్కుల్లో పడిపోతూ ఉంటుంది. మొదటి రకం మనస్తత్వానికి సంబంధించిన అంటురోగం దీనికి అతి సులభంగా అంటుకుంటుంది. ఈ విధంగా ఈ మనస్తత్వం గల వ్యక్తి తనను తాను ఆందోళనకు గురిచేసుకోవడంతో పాటు పనిచేసే వారిక్కూడా చికాకు పరుస్తుంటాడు – కూసే గాడిద వచ్చి మేసే గాడిదను చెడగొట్టినట్లు.

మూడవ రకం మనస్తత్వానికి లక్ష్యం కోసం పని చేయడం, పని చేయించడం ఎంతో అవసరం. పని బాగవడానికి, చెడిపోవడానికి తానే పూర్తి బాధ్యతను స్వీకరిస్తుంది. అది రెండు విధాల ప్రమాణాలకున్న వ్యత్యాసాన్ని అనుక్షణం తన దృష్టిలో పెట్టుకుంటుంది. ఈ విషయం గురించి స్వయంగా దాని స్థానమే దాన్ని వత్తిడి చేస్తుంది. అందువల్ల ఈ మనస్తత్వం, లక్ష్యం వైపునకు తన పురోగమనం వేగం బలమైన కారణం ఏదీ లేకుండానే తగ్గిపోకుండా ఎప్పటికప్పుడు తగు జాగ్రత్త వహిస్తూ పని చేస్తుంది. ఇది 'అసలు ప్రమాణాన్ని' ఎన్నడూ ఉపేక్షించదు. దాన్ని చేరుకునే కృషి పట్ల కూడా ఏమాత్రం ఏమరుపాటు, అజాగ్రత్తలు వహించదు. ఆ ప్రమాణానికి క్రిందికి దిగిపోయే ప్రతి విషయం పట్లా ఎంతో ఆందోళన వ్యక్తపరుస్తుంది.

అయితే ఆచరణయోగ్యమైన కనీస ప్రమాణంతో మాత్రం ఇది పని నడిపిస్తూనే ఉంటుంది. ఆ ప్రమాణం కంటే తక్కువ ప్రమాణానికి దిగజారిన సభ్యుల కారణంగా

ఇది తన పథకాన్ని మార్చుకోవడానికి బదులు వారిని తొలగించివేయడానికే ప్రయత్నిస్తుంది. తన శక్తి సామర్థ్యాలను అంచనా వేసుకోవడం, దాని ప్రకారం పనిని విస్తరింపజేయడం, అవసరాన్ని బట్టి దాని వేగం పెంచటం, తగ్గించటం చాలా అవసరం. అందులో పొరపాట్లు జరిగిపోతే లక్ష్యం దెబ్బతినే ప్రమాదం ఉంటుంది. అయితే దాని కోసం మూర్ఖత్వానికి పోయి మొదటి రెండు పద్ధతుల్ని అవలంబించరాదు.

ఈ విషయాన్ని గురించి అంచనా వేసుకోవడానికి మొదటి రెండు మనస్తత్వాలను ఆదర్శంగా తీసుకునే వ్యక్తి మూర్ఖాతిమూర్ఖుడు. అతనికి ఏదైనా ఆదర్శం కాగలిగితే ఈ మూడవ కోవకు చెందిన మనస్తత్వమే ఆదర్శం కాగలుగుతుంది. నేర్చుకోదలిస్తే దీని దగ్గరే పాఠాలు నేర్చుకోవాలి.

– ః సమాప్తం ః –